# సామెతల జ్ఞానము



ఇందూ ధర్మప్రదాత

సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వర్లు**





# సామెతల జ్ఞానము

రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు





ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-34 ప్రథమ ముద్రణ : ఏప్రిల్ - 2012


ప్రతులు : 1000 **వెల : 60 /-**


## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

"ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మపత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర.
41) భావము-భాష.
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము.
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము.
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు.
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.
76) నాది లోచన-నీది ఆలోచన.

**"ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు**

77) ధ్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
92) బ్రహ్మ-రావణబ్రహ్మ-భగవాన్ రావణబ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) ఖుర్ఆన్, హదీసు ఏది ముఖ్యము?
98) సుప్రసిద్ధి బోధ.
99) భక్తిలో మీరు సంసారులా? వ్యభిచారులా?
100) ౧౦౦, శతము, 100.
101) సిద్ధి బోధ.
102) సత్యార్థ ప్రకాశికలో సత్యమెంత.
103) రూపము మారిన గీత.
104) పోలీసులు-నేరస్థులు.
105) ఇప్పటి మానవుని పరిస్థితి.
106) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ, 28. తాత,
29. తల్లి, 30. భయం.
31. ఆత్మపని, 32. బట్టతల.
33. యాదవ్, 34. జ్ఞానశక్తి.
35. సమాధి, 36. 6-3=6.
37. సంతకము, 38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము, 40. తోలేవాడు.
41. తల్లి తండ్రి, 42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ, 44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి, 46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము, 48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు, 50. పురుషోత్తమ.
51. మతద్వేషము, 52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ, 54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు, 56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి, 58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు, 60. దశ-దిశలు.
61. మాట-మందు,
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.

106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు
మత సాంప్రదాయములు.
128. ఆహారము నీకా!
నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. కాలచక్రం.
131. బ్రహ్మావిద్య. 132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
137. జలం. 138. అధిపతి.
139. గ్రహాంతర వాసులు.
140. దేవుడు ద్వితీయుడా? అద్వితీయుడా?
141. మనిషి చేతిలో భగవంతుడు-
దేవుని చేతిలో మనిషి.
142. శరీరములో రక్తము-
గ్రంథములో జ్ఞానము.
143. గ్రంథములో జ్ఞానము-
మనిషిలో రక్తము.
144. త్రైత సిద్ధాంత చరిత్ర.
145. కుశాల్ కుశాల్ లంజమ్మ
నా నెత్తిమీద రెండు తన్నమ్మ.
146. రాజాధి రాజా - దేవాధి దేవా.
147. ఎనిమిది మంది భార్యలున్న
శ్రీకృష్ణునికి గోపికల మీద ధ్యాస ఎందుకు?
148. కులం-మతం, 149. గుడి.
150. గురుపౌర్ణమి సందర్భముగా మీటింగ్
151. భగవంతుడు ఎవరు?
152. విశ్వదాభిరామ వినుర వేమా.
153. కాలం, 154. యమధర్మ.
155. కుడి ధర్మం-ఎడమ ధర్మం
156. ఇందుత్వము అందరిలో కలదు-
హిందుత్వము కొందరిలో కలదు.
157. ధర్మములు మూడే ఉన్నవి
అధర్మములు ఆరు అయినవి?
158. నేను-నా తండ్రి-నా తాత,
నేను-నా అమ్మ-నా అవ్వ.
159. ఆద్య ఆత్మీకము-ఆధ్యాత్మికము,
ఆద్య దేవీకము-అద్యేవీకము.
160. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
ప్రబోధాశ్రమము, తాడిపత్రి (మం)
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లినిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 7989100433, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 9704651223, 9542385963

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)**
(ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హాస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**LAVANYA KANUMURI**
Cleveland, Ohio, U.S.A,
+1(440) 427 1158.

**S. RAGHU RAMI REDDY**
Seattle, WA, U.S.A,
+1 (425) 698 0375.

# సామెతల జ్ఞానము

పూర్వము  ఒక దేశములో ఎన్నో రాజ్యములుండెడివి. ఆ రాజ్యములకు రాజులూ ఉండెడివారు. ఒక చోట ప్రక్క ప్రక్కనే రెండూ సమాన విస్తీర్ణముగల రాజ్యములుండేవి. దేశములో ఆ రెండు రాజ్యములే పెద్దవిగా ఉండేవి. రెండు రాజ్యములలో ఒక రాజ్యము పొడవుగా ఉండగా, మరియొక రాజ్యము వెడల్పుగా ఉండేది. పొడవుగా ఉండే రాజ్యము పేరు లంబూ అని ఉండగా, వెడల్పుగా ఉండే రాజ్యము ఆరడి రాజ్యమని పిలువబడేవి. లంబూ రాజ్యమునకు, ఆరడి రాజ్యమునకు ఒకమారు యుద్ధము వచ్చినది. లంబూ రాజ్యములో సైనికులు పదివేల మంది ఉండగా, ఆరడి రాజ్యములో సైనికులు పదకొండువేలమంది ఉన్నారు. రెండు రాజ్యముల సరిహద్దులోనున్న బయలుప్రదేశమును యుద్ధ భూమిగా ఎంచుకొని అక్కడ యుద్ధమును చేయాలనుకొన్నారు. పూర్వము పగలు కాలములో కొన్ని గంటలు మాత్రము యుద్ధము చేసెడివారు. ఆ నియమము ప్రకారము ఎనిమిది గంటలు మాత్రమే యుద్ధము చేయుటకు నిశ్చయించుకొన్నారు. యుద్ధము మొదలై రెండురోజులైనది. ఆరడి రాజ్యము యొక్క సైనికులు పదకొండువేలుకాగా, లంబూ రాజ్యము యొక్క సైనికులు పదివేలమంది మాత్రమే ఉండుట వలన, లంబూ రాజ్యము వారు ఓడిపోతామేమో అని అనుకొన్నారు. ఓడిపోవుస్థితి తమకు రాకుండా లంబూ రాజ్యసైన్యాధిపతి  తమ గూఢచారులను ఆరడి సైన్యములోనికి పంపి, ఆ సైన్యము యొక్క రహస్యములను తెలుసుకోవాలనుకొన్నాడు. ఆరడి రాజ్యసైన్యాధిపతి ముందే తన గూఢచారులను లంబూ సైన్యములోనికి పంపియుండడము వలన,లంబూ రాజ్య సైన్యాధిపతి యొక్క పథకము ముందే ఆరడి సైన్యాధిపతికి తెలిసిపోయినది. అప్పుడు ఆరడి రాజ్య సైన్యాధిపతి తమ సైన్యములోనివారికి, క్రొత్త వ్యక్తులను కనుగొనుటకు

ఒక ఉపాయమును చెప్పాడు. తమ సైన్యములో ప్రతి దినము ఒక క్రొత్తపదమును గుర్తుగా పెట్టడము జరిగినది. ఆ గుర్తు తమ సైన్యము వారికి మాత్రమే తెలుసు. ఇతరులకు తెలియదు. కావున తమ సైన్యములో మనిషినైనా, కొన్ని ముఖ్యమైన స్థలములలోనికి వచ్చినపుడు తాము ముందే ఆ దినమునకు గుర్తుగా చెప్పియున్న పదమును అడిగెడివారు. అప్పుడు తమ సైన్యములోని సైనికుడైతే ఆ గుర్తును చెప్పగలుగును. అట్లుకాకుండా వేరే రాజ్య సైనికుడు గూఢచారిగా వచ్చియుంటే, గుర్తుగా చెప్పియున్న పదమును చెప్పలేకపోవును. అప్పుడు అతడు శత్రు సైన్య గూఢచారియని సులభముగా కనిపెట్టవచ్చును. ఈ విధానమును అనుసరిస్తూ, ప్రతి దినము ఉదయమే తమ సైన్యమునకు ఒక రహస్యపదమును చెప్పుచుండిరి. ఆ రహస్యపదము ఆ దినమునంతటికీ గుర్తుగా ఉండెడిది. ఆ గుర్తు ఆరడి సైన్యమునకు మాత్రము తెలియుట వలన ఎవరిమీదైనా అనుమానము వచ్చినపుడు, తమవాడా కాదా అని తెలుసుకొనుటకు రహస్య గుర్తును అడిగి, గుర్తును చెప్పగలిగితే తమవాడనీ, గుర్తును చెప్పలేకపోతే శత్రు సైన్యమువాడనీ తెలియగలుగుచుండిరి.

ఈ కాలములో కంప్యూటర్లయందు రహస్యముగా ఒక పదమును ఉంచి, ఆ పదమును టైప్ చేసినప్పుడే ఫైల్ వచ్చేటట్లు కంప్యూటర్‌లో అమర్చుచుందురు. కంప్యూటర్‌లో పాస్‌వర్డ్ అని ఒక పదమును పెట్టి, ఆ పదము తెలిసినవారికే కంప్యూటర్ ఓపెనగునట్లు (పని చేయునట్లు) అమర్చినట్లు, సైనికులలో పాస్‌వర్డ్‌లాంటి ఒక రహస్యపదమును గుర్తుగా పెట్టి, ఆ పద గుర్తును చెప్పినవానికే కొన్ని ద్వారములలో ప్రవేశమున్నట్లు చేసియుందురు. రహస్య గుర్తును తెలిసినవానిని తమవాడనీ, తెలియని వానిని శత్రుసైన్యము వాడనీ గుర్తించెడివారు. నేడు భారత సైన్యములో

కూడా రహస్యపదము (సీక్రెట్‌వర్డ్) ను వినియోగించుచున్నారు. రహస్య పదమును, ప్రతి దినము వేరువేరుగా ఉండేటట్లు, ఆ దినము యొక్క రహస్య పదము తమ సైన్యమునకు మాత్రము తెలియునట్లు అమర్చుకొనుచుందురు. కొన్ని నిషిద్ధ ప్రాంతములలోనికి కొందరు మాత్రమే వచ్చునట్లు, అక్కడికి రావలసినవారికి మాత్రమే ఒక గుర్తును చెప్పియుందురు. అక్కడికి పోయిన వారు ఆ గుర్తును చెప్పగలిగినప్పుడే వాడు అక్కడికి రావలసినవాడని మిగతా వారికి తెలిసిపోవును. అక్కడికి పోయి రహస్య గుర్తును చెప్పలేకపోతే అక్కడి కాపలావారు, వచ్చినవాడు తమవాడు కాదని గ్రహించి, వానిని అక్కడికి పోయినందుకు నిర్భందించుదురు. ఈ విధముగా సైన్యములోగానీ, రహస్య ప్రాంతములలోగానీ సీక్రెట్‌వర్డ్‌ను అమలులో పెట్టుకొన్నారు.

ప్రస్తుత కాలములో యంత్రముల వినియోగము ఎక్కువైపోయింది. వయర్‌లెస్ ద్వారా (రేడియో ద్వారా) ఎంతదూరమునుండైనా మాట్లాడు కోవడము జరుగుచున్నది. సైన్యములో సైనికులు ఒక ప్రాంతమునుండి మరియొక ప్రాంతమునకు రేడియో ద్వారా యుద్ధ సమయములో మాట్లాడ వలసివచ్చినపుడు, ఆ మాటలను శత్రువులు వినినా అర్థము కానట్లు భాషను తయారు చేసియుందురు. సైన్యములో రేడియో మీద పనిచేయు వయర్ లెస్ ఆపరేటర్లు మాత్రము, మాట్లాడు విధానమును ప్రత్యేకముగా నేర్చియుందురు. ఉదాహరణకు, వారి భాష ఎలాగుండునంటే, ఒక సైనికుడు తనకు నీళ్ళు అవసరమై నీటిని గురించి అడుగవలసి వచ్చినపుడు, “నాకు నీళ్ళు కావాలి” అను మాటను “విమానము రావాలి” అని చెప్పును. రేడియోలో ఆ మాటవినిన వేరే ప్రాంతములోని సైనికునికి ‘విమానము’ అంటే నీరనీ, ‘రావాలి’ అంటే ‘కావాలి’ అనీ అర్థము తెలిసివుండుట వలన వాడు చెప్పిన విషయము వీనికి అర్థమైపోవును. ఒకవేళ అదే మాటను

శత్రుసైన్యములు తమ రేడియో ద్వారా వినినా, వినిన మాటలోని అసలు విషయము తెలియదు. ఈ విధముగా సైనికులు తాము మాట్లాడినా, శత్రు సైనికులకు తెలియకుండా, తమవారికి మాత్రమే తెలియునట్లు కోడ్ భాషను వాడుదురు. ఇంగ్లీష్ భాషలో కోడ్ అనగా పెద్ద అర్థమునిచ్చు చిన్న పదము అని చెప్పవచ్చును. రహస్యకోడ్ భాష, కొన్ని ముఖ్యమైన విషయములందు వాడుచుందురు. ఒక్కొక్క గుర్తు (కోడ్) ఒక్కొక్క భావమును తెలుపునదిగా ఉండును. గుర్తు అనగా గురించి చెప్పునదని అర్థము. దేనిని గురించి చెప్పునది అని ప్రశ్నరాకుండా, దేనిని గురించి గుర్తు పెట్టియుంటే దానిని గురించే చెప్పునదని తెలియవలెను. ఉదాహరణకు సంఖ్యలలో ముందే నిర్ణయించుకొని గుర్తుగా పెట్టుకొన్న సంఖ్య ఏదైతే ఉందో, ఆ సంఖ్య దానిని గురించే వివరించును. దేవునికి గుర్తుగా “9” సంఖ్యను, ఆత్మకు గుర్తుగా “6” సంఖ్యను, జీవునికి గుర్తుగా “3” సంఖ్యను శాస్త్రీయముగా పెట్టుకొన్నప్పుడు, ఎప్పుడు ‘9” సంఖ్యను చెప్పినా అది దేవున్ని గురించి తెలుపునదిగా అర్థమగును. అప్పుడు దేవునికోడ్ “9” గా ఎప్పటికీ మారనిదిగా ఉండిపోవును. దేవుడు సృష్ఠిని తయారు చేసిన తర్వాత, జీవాత్మ, ఆత్మ, పరమాత్మయని మూడు భాగములుగా ప్రతి శరీరములో ఉన్నాడు. కావున **సృష్ఠికర్త కోడ్ “963”** అని చెప్పడమైనది. పరమాత్మకు “9” గుర్తును, ఆత్మకు “6” గుర్తును, జీవాత్మకు “3” గుర్తును తీసుకొనుటకు ఆధారము భగవద్గీతయని చెప్పుచున్నాము.

ఈ విధముగా పూర్వము, పెద్దలు ఆధ్యాత్మికవిద్య ఎప్పటికీ ఉండునట్లు, ఎప్పటికీ మారనట్లు, అందరికీ తెలియునట్లు చేయుటకు కొన్ని రకముల గుర్తులకు ఎంతో భావమును అమర్చి, మనము మాట్లాడుకొను భాషలో కలపడము జరిగినది. భారతదేశములోని మిగతా భాషలలో

ఆధ్యాత్మిక విద్యయందు గుర్తు (కోడ్)లు ఉన్నాయో లేదో నాకు తెలియదు. తెలుగుభాషలో మాత్రము దైవజ్ఞానమును ఇమిడ్చిన గుర్తులు ఎన్నో ఉన్నాయని చెప్పవచ్చును. జ్ఞానమును తెలుపు గుర్తులను, అనేక సందర్భములలో మనుషులు మాట్లాడునట్లు, ఆనాటి పెద్దలు మనుషులకు అలవాటు చేశారు. ప్రపంచ విషయములలో మునిగినవారు కూడా తాము మాట్లాడునప్పుడు, సందర్భమునుబట్టి, అక్కడి సమస్యకు దగ్గరగానున్న మాటను చెప్పునట్లు, పెద్దలు అలవాటు చేయగా, చాలాకాలము మనుషుల మాటలలో అప్పుడప్పుడు అనుచూ వచ్చారు. ప్రపంచ విషయమునకు సమానమైన మాటను వాడినప్పుడు దానిని సమత అనియు, అట్లే సామెత అనియు అనడము జరిగినది. తెలుగు భాషలో గల ఒక సామెతయందు ఎంతో అర్థము ఇమిడియున్నది. అందువలన సామెతను రహస్య పదము అనియు సీక్రెట్‌కోడ్ అనియు చెప్పవచ్చును. ఒక మూట ఉన్నప్పుడు, దానిని విప్పితే అందులో ఎంతో సామగ్రి ఉన్నట్లు, సామెత మూటవలె కలదు. అందులో ఎంతో వివరము ఇమిడియున్నది. బ్యాంకు నుంచి తెచ్చిన మూటను విప్పితే డబ్బు దొరుకును. సంతనుండి తెచ్చిన మూటను విప్పితే కాయగూరలు దొరుకును. ఇట్లు అనేక సందర్భములలో వాడు సామెతలయందు ఆ సందర్భమునకు సంబంధించిన జ్ఞానముండును. సామెత అనగా ఒక గొప్ప వివరమును దాచిన చిన్న గుర్తు అని తెలిసింది కదా! అటువంటి సామెతలు తెలుగు భాషలో ఎన్నో ఉండినా, ప్రస్తుత కాలములో వాటిని వాడేవారు ఎవరూ లేకుండా పోవుచున్నారు. పూర్వము ప్రతి మనిషి సామెతను చెప్పంది మాట్లాడేవారు కాదు. నేడు సామెతను చెప్పేవారు కరువైపోయారు. ఎక్కడైనా మారుమూల గ్రామములలో ఎవరైనా పాతకాలము ముసలివారు సామెతలను చెప్పి మాట్లాడుట మిగిలి యుండవచ్చును.

ఒక చిన్న పదములో ఎంతో విలువను దాచియుంచిన సామెతలను తెలుగు భాషలో పోగొట్టుకోవడము మన దురదృష్టము. తెలుగు భాష ఎంతో గొప్పదనీ, తెలుగు భాష దేశభాషలలోనే కాకుండా దేహి భాషలో కూడా గొప్పదనీ, తెలుగు భాష దైవజ్ఞానమునకు ఎంతో దగ్గరగానున్న భాషయనీ మేము చాలామార్లు చెప్పాము. తెలుగు భాషలోనున్న సామెతలు ఎంతో గొప్పవని తెలుపుటకు ఇప్పుడు ఈ గ్రంథమును వ్రాయుచున్నాము. తెలుగు భాషలో కొన్ని వందల సామెతలున్నా, వాటియందు కొన్ని ప్రదేశములలో కొందరు కొన్నిటిని వాడుచున్నారు. నేను కూడా ఈ కాలము మనిషినే కావున సామెతలన్నిటి గురించి నాకు కూడా తెలియదు. అయినా నాకు తెలిసినంతవరకు వివరముగా చెప్పాలనుకొన్నాను. ఇప్పుడు మేము చెప్పు సామెతలు దైవజ్ఞాన సంబంధమైనవైనా ప్రపంచములో కొన్ని సందర్భములలో వాడుకోవచ్చును. కొన్ని సామెతలు కాలగమనములో మారిపోయి కనిపిస్తున్నవి. ఉదాహరణకు "పనిలేని మంగళి పిలిచి తల కొరిగినట్లు" అను సామెతను కొందరు "పనిలేని మంగళి పిల్లి తల గొరిగినట్లు" అని చెప్పగా విన్నాము. ఈ సామెత కాలక్రమములో "పిలిచి" పోయి "పిల్లి" అయినదని తెలియుచున్నది. అటువంటి సామెతలను కూడా సరిచేసుకొని చెప్పడము మా పనిగా పెట్టుకొన్నాము.

## 1. ఉద్యోగము పురుష లక్షణం

ఇపుడు ప్రపంచ సంబంధ విషయమునకు సమానముగానున్న ఒక సామెతను చెప్పుకొందాము. సామెతకంటే ముందు ప్రపంచ విషయము ఏదో ముందు తెలుసుకొని, దానికి సరిపడు సామెతను తీసుకొందాము.

ఒక ఊరిలో ఒకడు బాగా చదువుకొని యం.ఎ.పట్టాను (యం.ఎ డిగ్రీని) పొందాడు. అలా చదివి వాడు ఏ ఉద్యోగము కొరకూ ప్రయత్నించలేదు. తర్వాత కొందరు చెప్పగా, కొన్నిటికి ప్రయత్నించగా, అతనికి ఉద్యోగము రాలేదు. అప్పుడు వాని విషయమంతా ప్రపంచ విషయమే గానీ, దైవజ్ఞానమునకు సంబంధించిన విషయమేమీ కాదని మనకు కూడా తెలుసు. అయినా వాని విషయములో మాట్లాడు కొందరు, అతనికి బుద్ధి చెప్పినట్లు "ఉద్యోగమ్ పురుషలక్షణమ్" అని చెప్పుచూ "ఉద్యోగమును వెదికి చూచుకో, ఉద్యోగము చేయడమే పురుషలక్షణమని పెద్దలన్నారు కదా! నీవు మగవానివై ఇంటివద్ద ఉద్యోగము చేయకుండా ఉండకూడదు. అలా ఉద్యోగము లేకుండా ఉండడము పురుషలక్షణము కాదు" అని చెప్పారు. పురుషుడైనవాడు ఉద్యోగము చేయడమే అతని లక్షణమని చెప్పిన మాట, అప్పటి ప్రపంచ స్థితినిబట్టి అతనికి సరిపోయినా, ఆ మాటలో ఎంతో దైవజ్ఞాన సందేశము ఇమిడి ఉన్నది. ప్రపంచ పరిస్థితిని బట్టి అలా చెప్పిన సామెత (సమత) దైవజ్ఞానముతో కూడి ఉన్నదని ఎవరికీ తెలియదు. అప్పటికి తెలియక పోయినా ఆ సామెత ప్రజలకు అలవాటు కావలెనని, ఆ సందర్భములో దానిని చెప్పారు. సందర్భమునుబట్టి చెప్పు సామెతను గురించి ఎవరో ఒకరు ఆలోచిస్తారనీ, వారి ఆలోచనకు అందనప్పుడు ఇతరులను అడిగి వారి యోచనకు వచ్చిన విషయమును తెలుసుకోగలరనీ, దేవుని జ్ఞానము తెలిసిన వారు అలా సామెతను తయారు చేశారు.

సామెతను తయారు చేసినవారు పురుష లక్షణమ్ అను పదమును వాడారు. పురుష లక్షణముకు వ్యతిరేఖ పదము స్త్రీ లక్షణము కలదు. ఉద్యోగము చేయుట పురుష లక్షణము అయినపుడు, ఉద్యోగము చేయక పోవడము స్త్రీ లక్షణము అవుతుంది కదా! ప్రస్తుతానికి అతడు ఉద్యోగము

చేయలేదు, కావున అతనికి స్త్రీ లక్షణములున్నవనీ, ఉద్యోగము చేసినపుడు పురుష లక్షణములు వస్తాయి అని, ఆ సామెతనుబట్టి మనకు అర్థమగు చున్నది. ఉద్యోగము లేనప్పుడు ఉన్న స్త్రీ లక్షణము ఏమిటి? ఉద్యోగము ఉన్నప్పుడు ఉండే పురుష లక్షణము ఏమిటి? అని ప్రశ్నించుకొని చూస్తే మా యోచనకు ఇలా తెలియుచున్నది. ఈ సామెతను ప్రపంచ విషయము నకు సంబంధించిన సందర్భములో వాడినా, అందులో దైవికమైన జ్ఞాన సందేశముండునని ముందే చెప్పుకొన్నాము కదా! దాని ప్రకారము ప్రపంచ ములో స్త్రీ లక్షణము, పురుష లక్షణములని రెండు లక్షణములు కలవు. స్త్రీ లక్షణమనగా ప్రకృతి లక్షణమనీ, పురుషలక్షణమనగా పరమాత్మ లక్ష్యణమని చెప్పవచ్చును. భగవద్గీతలో గుణత్రయ విభాగయోగమున మూడు, నాలుగు శ్లోకములలోనే ప్రకృతి స్త్రీయనీ, పరమాత్మ అయిన తాను పురుషుడనీ, మా ఇద్దరికీ కలిగిన సంతానమే సర్వజీవరాసులనీ, దేవుడు చెప్పడము జరిగినది. స్త్రీ, పురుషులు ప్రకృతి, పరమాత్మలని తెలిసినపుడు, ఉద్యోగము లేనప్పుడు స్త్రీ లక్షణము (ప్రకృతి లక్షణము), ఉద్యోగము ఉన్నపుడు పురుష లక్షణము (దైవ లక్షణము) అగుటకు గల కారణమును తెలియుటకు ముందు ఉద్యోగమంటే ఏమిటో, దానికీ పురుషునికీ గల అనుబంధమేమిటో తెలుసుకొందాము.

ఉద్యోగమును విడదీసి చూస్తే ఉద్+యోగము = ఉద్యోగము అని కలదు. ఉద్ అనగా పై భాగమున లేక అన్నిటికంటే పెద్ద అని అర్థము రాగలదు. అన్నిటికంటే పెద్ద అను దానిని బ్రహ్మ అంటారు. బ్రహ్మ అన్నిటికంటే పెద్ద, కావున బ్రహ్మను దేవుడు అనవచ్చును. ఈ ప్రకారము ఉద్ అనగా దేవుడు అని తెలియుచున్నది. యోగము అను పదము యొక్క అర్థము కలయిక అని తెలియుచున్నది. దేవునితో కలియడమును

ఉద్యోగము అంటాము. ఎవడైతే దేవునితో కలిసివున్నాడో, వాడు కూడా దేవుడే అగును కదా! దేవునియందు కలిసిపోయినవాడు ప్రత్యేకముగా ఉన్నాడని చెప్పలేము కదా! దేవునియందు కలియనంతవరకు ప్రకృతి లక్షణములతో కూడుకొనియున్న జీవుడు, ప్రకృతి లక్షణములను వదలి దేవునియందు కలిసిపోయి, తాను కూడా పురుషుడగుచున్నాడు. జీవుని యందు ప్రకృతి, పురుషుని రెండు లక్షణములు కలిసివున్నవి. ఎవడైతే యోగము చేసి చివరకు ఉద్యోగమును పొందుచున్నాడో, వాడు ప్రకృతి లక్షణములను వదలి పురుష (దైవ) లక్షణములను పూర్తిగా పొందుచున్నాడు. అందువలన ఉద్యోగము పురుష లక్షణమన్నారు. ఉద్యోగము అనగా మోక్షమనీ, పురుషుడు అనగా దేవుడనీ, పురుష లక్షణమనగా దేవునిగా మారిపోవడమనీ, జీవుడు తనలోని ప్రకృతి తత్త్వమును వీడి పూర్తి పురుషునిగా (దేవునిగా) మారిపోవడమనీ అర్థము. ఇదంతయు చూచిన తర్వాత, ఉద్యోగము పురుష లక్షణమను మాటలో దైవజ్ఞానమునకు సంబంధించిన విషయము దాగివున్నదని తెలియుచున్నది. ఈ మాట జ్ఞానమునకు సంబంధించినదైనా, కొన్ని ప్రపంచ సంబంధ విషయములకు దగ్గర సంబంధమున్న సందర్భములలో వాడుట వలన, ఆ మాట ప్రచారమై పోయి లోకమునకు తెలిసిన తర్వాత, ఎప్పుడో ఒకప్పుడు దాని వివరము తెలియగలదని, సామెతను తెలియ చేసినవారు అనుకొన్నారు. వారి ఉద్దేశ్యము ఇప్పుడు నెరవేరిందనుకుంటాను.

## 2. ఆలూ లేదు, సూలూ లేదు, కొడుకు పేరు సోమలింగడు

ప్రపంచ విషయములలో ఏదైనా ముందే ఊహించి ఎవడైనా చెప్పితే, దానిని విన్నవారు అతను చెప్పినది ఆధారములేకుండా చెప్పినదనీ, అది

నిజమో కాదోయనీ, అతని మాటను నమ్ముటకు వీలులేదు అన్నట్లు గుర్తుగా ఒకమాటను చెప్పడము కలదు. ఉదాహరణకు ఒక వ్యక్తి రాబోయే సంవత్సరము వర్షములు బాగావచ్చి వేరుశెనగపంట బాగా పండుతుందని చెప్పాడనుకొనుము. దానిని విన్నవాడు ఇలా అన్నాడట. సేద్యమూ చేయలేదు, వర్షమూ రాలేదు, ముందే వేరుశెనగ పంట పండుతుందని చెప్పడము "ఆలూలేదు, సూలూలేదు, కొడుకు పేరు సోమలింగడు" అన్నట్లున్నది అని చెప్పాడట. అట్లు చెప్పడము వలన పంట పండుతుందని ముందే చెప్పడము ఆధారములేని విషయమనీ, దానిని నమ్ముటకు వీలు లేదనీ, వినేవారికి అర్థమగుచున్నది. "ఆలూలేదు, సూలూ లేదు, కొడుకు పేరు సోమలింగడు" అను సామెత, అప్పటి వారి ప్రపంచ ఉద్దేశ్యమునకు సరిపోయినా, అందులో దైవజ్ఞానమునకు సంబంధించిన వివరము ఇమిడి ఉన్నదని అర్థమగుచున్నది. చెప్పబడిన సామెత అప్పుడు అక్కడి సందర్భము లోని విషయమునకు పూర్తిగా సరిపడునట్లు ఉన్నా, యోచించువారికి ఆ సామెత దైవజ్ఞానమునకు గుర్తుగా కనిపించుచున్నది. గుర్తు అనగా గురించి చెప్పునదని చెప్పుకొన్నాము కదా! ఈ గుర్తును తయారు చేసినవాడు దేని కొరకు చేశాడో దానిని గురించి చెప్పగలదు. ఈ గుర్తు లేక ఈ సామెతలో ఏమిగలదో ఇప్పుడు మనము వివరించుకొందాము.

ఆధ్యాత్మిక జ్ఞానము ప్రకారమూ, దేవుడు భగవంతునిగా చెప్పిన భగవద్గీత ప్రకారము ప్రకృతి, పరమాత్మలను వారు విశ్వములో కలరు. ప్రకృతి స్త్రీ తత్త్వము కలది కాగా, పరమాత్మ పురుషతత్త్వము కలవాడు. పురుషుడైన దేవుని బీజము వలన, ప్రకృతి గర్భము నుండి సకల జీవరాసులు పుట్టుచున్నవనీ, అందువలన సకల జీవులకు తల్లి ప్రకృతియనీ, తండ్రి పరమాత్మయనీ గీతలో చెప్పడమైనది. ఒక మనిషి తాను ముందు

దైవజ్ఞానమును సంపూర్ణముగా తెలుసుకొన్న తర్వాత యోగసాధన చేసి యోగికావచ్చును. తర్వాత మోక్షమును పొందవచ్చును. మొదట దైవ జ్ఞానములో ప్రకృతి ఏదియనీ, అది అందరికీ తల్లి ఎలా అగుచున్నదనీ, అలాగే పరమాత్మ ఎటువంటివాడనీ, ఆయన అందరికీ తండ్రి ఎలా అయివున్నాడనీ పూర్తిగా జ్ఞానముతో తెలియాలి. ఆ విషయమును ఈ సామెతతో పోల్చారు. ప్రకృతిని ఆలు (భార్య) అని అన్నారు. పరమాత్మ బీజము వలన ఏర్పడు గర్భమును సూలు అన్నారు. ఎవడైనా ప్రకృతిని గురించిగానీ, పరమాత్మ బీజమును గురించిగానీ తెలియనప్పుడు, యోగి ఎలా కాగలడు? అను అర్థము వచ్చునట్లు కొడుకు పేరు సోమలింగడు అన్నట్లు అని అన్నారు. సోముడు అనగా చంద్రుడనీ జ్ఞానమనీ అర్థము. సోమలింగడు అనగా జ్ఞానము వలన అయిన యోగి అని అర్థము. దీనినిబట్టి ప్రకృతి పురుషుల జ్ఞానము తెలియనిది ఎవడు కూడా యోగికాలేడు అని తెలియుచున్నది. వర్షము, సేద్యము రెండూ లేనప్పుడు పంటను గురించి చెప్పితే ఎంత అసత్యమో, ప్రకృతి జ్ఞానము, పరమాత్మ జ్ఞానము తెలియనప్పుడు వానిని యోగి అనడము అంతే అసత్యమగునని తెలియుచున్నది. చెప్పింది ప్రపంచ సంబంధ విషయమునకు సమానముగా ఉన్న పోలిక అయినా, అందులో ఎంతో ఆత్మజ్ఞానమును ఇమిడ్చి, ఈ సామెతను తయారు చేసి చెప్పారని అర్థమగుచున్నది. దైవ జ్ఞానమును ప్రచారము చేయుటను దైవసేవగా తెలిసిన జ్ఞానులు ఈ విధముగా వారికి తెలిసిన జ్ఞానమును సందర్భము చూచి, సామెతల రూపములో చెప్పి, దేవుని జ్ఞానము ప్రజలలోనికి పోవునట్లు చేశారు.

# 3. పౌరుషానికి మంగళ కత్తులు మ్రింగినట్లు

కొంతమంది పంతానికి పోయి అనవసరముగా గొడవలు పడుచుందురు. తమకంటే అన్ని విధముల బలమైన వారితో పోటీపడి చివరకు తామే నష్టపోవుచుందురు. ఇటువంటి సంఘటనలు అక్కడక్కడ జరుగుచుండును. అటువంటి సందర్భములో ఆ పనికి సరిపోవు సమతను (సామెతను) దైవజ్ఞానమును తెలిసిన పెద్దలు చెప్పడము జరిగినది. ఆ సామెత ఇలా ఉన్నది. "పౌరుషానికి మంగళ కత్తులు మ్రింగినట్లు" అను ఈ మాటలో అనవసరమైన పోటీకి పోయి తానే నష్టపోయినట్లు అని తెలిసినా, అందులో సూక్ష్మమైన జ్ఞానము కలదు. పైకి కనిపించకుండా ఉన్న జ్ఞానమును కనిపించు ప్రపంచ విషయములో ఉపయోగించడము వలన, ఈ మాట ఆ సందర్భములో సరిపోయినా, ఈ సామెతలో గల పదములను విడదీసుకొని చూస్తే, కనిపించని సూక్ష్మజ్ఞానము అర్థము కాగలదు. పౌరుషము అనుమాట బాహ్యప్రపంచములో వినియోగిస్తున్నా, అది ఆధ్యాత్మికములో ప్రత్యేకమైన అర్థముగలదిగా ఉన్నది. అలాగే మంగళకత్తులు అను పదము బయట ప్రపంచములో అందరికీ తెలిసిన పదము అయినా, అది ఆధ్యాత్మిక విద్యలో మరియొక విలువైన అర్థమును ఇవ్వగలదు. ఈ విధముగా ఆధ్యాత్మిక విద్య (బ్రహ్మవిద్య) ప్రకారము ఈ సామెతను వివరించుకొని చూస్తే, ఇట్లు అర్థమగుచున్నది.

పౌరుషము అనగా పురుషత్వమని అర్థము. పురుషత్వము అను మాట స్థూలముగా పురుషుల (మగవారి) ఎడల వాడినా, సూక్ష్మముగానున్న భావమును చూస్తే పురుషుడు అనగా దేవుడు అనియూ, పురుషత్వము అనగా దైవత్వమును తెలుసుకొనుటనియూ అర్థము. తర్వాత మంగళ కత్తులు అను పదములో కత్తులు అంటే ఖండించునవి, త్రెంచివేయునవని అర్థము.

మంగళ అనగా శుభకరమైన అని అర్థము. అన్ని రకములా, దేవునికంటే శుభకరమైనది ప్రపంచములో ఏదీలేదు. కావున శుభకరము అనగా దేవుడు అని అర్థము. మంగళము అను మాట దేవున్ని తెలుపు నిమిత్తముగానీ, మోక్షమును తెలుపు నిమిత్తముగానీ ఆధ్యాత్మిక విద్యలో వాడుచుందుము. మంగళ కత్తులు అనగా దైవశక్తిగల జ్ఞానమని అర్థము. దైవశక్తిని జ్ఞానాగ్ని అనికూడా అనుచుందురు. జ్ఞానాగ్ని వలన సకలమైన కర్మలు కాలిపోవును. దేవుని జ్ఞానము వలన కర్మ నశించిపోవుచున్నది. కావున కర్మను కాల్చు దైవ జ్ఞానమును మంగళకత్తులు అనడము జరుగుచున్నది. పైకి కనిపించు ప్రపంచ విధానములోని మాటగా చెప్పిన సామెత వలన, విశేషమైన వివరము తెలియుచున్నది. దేవున్ని తెలుసుకొనుటకు లేక దేవునియందైక్యమగుటకు కర్మను ఖండించి నాశనము చేయు దైవజ్ఞానమును తెలియవలెనని అర్థమగుచున్నది. పౌరుషానికి అనగా దేవున్ని తెలియుటకు, మంగళకత్తులు అనగా కర్మను ఖండించు దైవ జ్ఞానమును, మింగవలెను అనగా శరీరము లోని తలకు ఎక్కించుకోవలెను. దైవజ్ఞానమును తెలియనివాడు, జన్మకు కారణమైన కర్మను లేకుండా చేసుకోలేడు, దేవున్ని తెలియలేడు. కర్మవున్న వాడు దేవునియందైక్యము కాడు. దేవునియందైక్యము కానిది దేవుడు ఎట్లున్నది ఎవరికీ తెలియదు. ఈ జ్ఞాన విషయమును తెలుపు నిమిత్తము "పౌరుషానికి మంగళ కత్తులు మ్రింగినట్లు" అను సామెతను చెప్పారు.

## 4. లంజ బిడ్డకు తండ్రి ఎవడు

బయట ప్రపంచములో వ్యభిచారిణిని లంజ అనడము కూడా జరుగుచున్నది. లంజ అను పదము మొరటుగా కనిపించినా పూర్వము అందరూ ఆ పదమునే వాడేవారు. ఈ మధ్యకాలములో కొందరు

గ్రంథములలో వ్రాయునప్పుడు, వ్యభిచారి అను పదమును ఉపయోగించి వ్రాస్తున్నారు. లంజ అనగా ఒక పురుషునితోనే శరీర సంబంధము పెట్టుకోక మరియొక పురుషునితో కూడా సంబంధము పెట్టుకొన్నదని అర్థము. ఒక పురుషునితోకాక మరియొకనితో గానీ, అంతకంటే ఎక్కువ మందితో గానీ సంబంధమున్నవారిని లంజ అనినా, అర్థము ప్రకారము ఒక పురుషునితోనే కాక రెండవ పురుషునితో సంబంధము పెట్టుకున్నపుడే ఆ స్త్రీని లంజ అనడము జరుగుచున్నది. రెండవ పురుషునితో సంబంధము పెట్టుకొన్నపుడు ఆమెకు సంతానము కల్గితే, పుట్టిన బిడ్డ ఎవరి బీజముతో పుట్టినది తల్లికి కూడా తెలియదు. **"జ"** అనగా పుట్టడము **"లం"** అనగా తెలియదు అని అర్థము. తెలియకుండా పుట్టించుకొన్నదని చెప్పుటకు **"లంజ"** అని అన్నారు. సహజముగా ఒక పురుషునితో సంబంధము కల్గిన స్త్రీకి, తన బిడ్డకు తండ్రి ఎవడో తెలిసియుండును. అయితే సహజముగా కాకుండా ఇద్దరితో సంబంధము పెట్టుకొన్నపుడు తన బిడ్డకు తండ్రి ఎవరో ఖచ్చితముగా చెప్పలేని స్థితిలో తల్లి వుండిపోవును. అటువంటి స్త్రీని లంజ అనడము జరిగినది. ఇదే విషయమునకు సమానమైన ప్రపంచ విషయముంటే, అక్కడ ఖచ్ఛితముగా ఇది అని చెప్పలేని స్థితి ఏర్పడినపుడు, "లంజ బిడ్డకు తండ్రి ఎవడు" అను సామెతను వాడుచుందురు.

ఒక స్త్రీ తన బిడ్డకు ఖచ్చితమైన తండ్రి ఫలానావాడు అని తెలియనప్పుడు ఆమెను లంజ అని అనడము జరుగుచున్నది. ఈ సూత్రము ప్రకారము, తన బిడ్డకు నిజమైన తండ్రి ఇతనే అని తేల్చి చెప్పగలిగిన స్త్రీని లంజ అని అనకూడదు. లంజ అంటే పుట్టిన సంతానము యొక్క తండ్రిని గురించి తెలియనిది అని అర్థమున్నపుడు, ఫలానావాడే తన బిడ్డకు తండ్రి అని తెలిసినప్పుడు, లంజ అను పదము ఆమెకు వర్తించదు. ఒక ఊరిలో

ఒక స్త్రీకి పెళ్లై పది సంవత్సరములైనది. అయినా ఆమెకు సంతానము కలుగలేదు. ఆమెకు తన భర్త పురుషత్వము లేనివాడని తెలుసు, అందువలన ఆమెకు తన భర్త ద్వారా పిల్లలు పుట్టరని తెలుసు. అటువంటపుడు అడవిలో నున్న ఒక మహర్షివద్దకు పోయి, సంతానమును గురించి అడిగి తెలుసు కోవాలనుకొన్నది. ఒక మంచిరోజు ఆ మహర్షి పుట్టిన దినమున అందరితో పాటు ఆమె కూడా అడవికి పోయింది. ఆ మహర్షి 120 సంవత్సరములు బ్రతికి, 121వ పుట్టిన రోజు వచ్చినపుడు ఎంతోమంది జనము పోవు చుండగా ఆమె కూడా పోయింది. రెండు రోజులు అక్కడేవుండి ఎవరూ లేని సమయములో తన సంతతిని గురించి అడిగింది. తన భర్త విషయము కూడా చెప్పింది. ఆమె చెప్పినదంతా వినిన మహర్షి ఆమెతో ఇట్లన్నాడు "నా 122వ జన్మ దినమునకు కొడుకును ఎత్తుకొని వస్తావు" అని చెప్పి పంపాడు. ఆ మహర్షి చెప్పిన మాటకు సంతోషించిన ఆమె తన ఇంటికి వచ్చింది. ఇంటికి వచ్చు సమయములో ఆమెతోపాటు మిగతా ఐదుమంది మహిళలు కూడా ఉన్నారు. ఆరుమంది అడవిలో వస్తుండగా పదిమంది దొంగల గుంపు వారిమీద దాడిచేసింది. అడవి దారి ఇరువైపులా, పూర్తిగా చెట్లపొదలతో నిండుకొని ఉన్నది. పదిమంది దొంగలు, ఆరుమంది ఆడవారికి కనిపిస్తూనే వారు దొంగలనుండి తప్పించుకోవాలని ప్రక్కనేయున్న పొదలలోనికి పారిపోయారు. అయినా దొంగలు వారిని వదలకుండా, పట్టుకొని వారివద్దనున్న ఆభరణములను లాగుకొన్నారు. దొంగలను చూస్తూనే ప్రక్క పొదలలోనికి పోయి దాచిపెట్టుకోవాలనుకొనినా వారి ప్రయత్నము కుదరలేదు. అయితే అక్కడ సంతతి కొరకు పోయిన స్త్రీ, ఒక వైపు ఒక్కతే పోయినదానివలన ఆమె ఒంటరిదైనది. దొంగలు పొదలలోనున్న వారిని వెదికిపట్టుకొన్నారు. ఒక దొంగకు ఆమె ఒక్కతే

దొరికింది. అప్పుడు ఆ దొంగ ఆమె సొమ్ములను లాగుకొనడమే కాకుండా, ఆమెను పొదల మధ్యలో బలవంతముగా మానభంగము చేసిపోయాడు. అక్కడ జరిగిన విషయము మిగతా వారికి ఎవరికీ తెలియదు. దొంగలందరూ ఆడవారందరినీ దారిలోనికి లాగుకొనివచ్చి, తాము తమ సొమ్ములను దొంగిలించినట్లు పోలిసులకు చెప్పితే, తర్వాత మీ ఇంటికి వచ్చి చంపేస్తామని బెదిరించి పోయారు. ఈ విధముగ మిగతా ఐదుమంది ఆడవారు తమ సొమ్ములను పోగొట్టుకొన్నారు. సంతానము కొరకు పోయిన స్త్రీకి సొమ్ములేకాక శీలము కూడా పోయింది.

అడవిలో బయలుదేరిన ఆడవారంతా ఒకే ఊరివారు. కావున అందరూ కలిసి, సాయంకాలమునకు తమ ఊరు చేరుకొన్నారు. ఒక నెల కాలము గడచిపోయిన తర్వాత సంతానము కొరకు అడవికిపోయి వృద్ధ మహర్షిని అడిగి వచ్చిన మహిళకు గర్భము నిలిచినట్లు తెలిసింది. ఆమెకు ఏమీ అర్థము కాలేదు. ఆమె భర్త మరియు ఇంటిలోని వారు ఇదంతయు మహర్షి యొక్క మహత్యమే అనుకొన్నారు. తర్వాత తొమ్మిది నెలలకు కొడుకును ప్రసవించిన ఆమె, అడవిలోనికి మహర్షి యొక్క 122వ జన్మదిన వేడుకలకు తన మూడు నెలల కొడుకుతో సహా పోయింది. రెండు రోజులు అక్కడే ఉండి, చివరకు మహర్షిని దర్శించి, తన పుత్రుని మహర్షి పాదముల చెంతపెట్టి నమస్కరించింది. అప్పుడు ఆమెను చూచిన మహర్షి ఒకమారు నవ్వి ఇలా అన్నాడు.

మహర్షి :- ఏమి బిడ్డా నీకోర్కె నెరవేరింది కదా! ఎందుకు చింతగా ఉన్నావు?

మహిళ :- స్వామీ! మీకు తెలియనిది ఏముంది?

మహర్షి :- నీవు ఎలా అనుకొన్నా నాకు ఏమీ తెలియదు. మీ ఊహకు నేను గొప్పగా కనిపించినా, నాస్థితి ఏమో నాకు తెలుసు. నీ స్థితి నాకు తెలియదు. కావున ఎందుకు దిగులుగా ఉన్నావని అడిగాను.

మహిళ :- నాలో ఒక వేదన ఉంది. అది ఎవరికీ తెలియదు. మీతో చెప్పుకొనేంత వరకు నా మనస్సు కుదుటపడదు.

మహర్షి :- ప్రపంచ విషయములకు దూరముగా ఉన్నవానిని, నాతో చెప్పడములో తప్పులేదు. నీ బాధ ఏమో చెప్పు.

మహిళ :- మిమ్ములను తాకడానికి కూడా నేను అర్హురాలనో కాదో, మీరు చెప్పమంటున్నారు కాబట్టి ధైర్యముగా చెప్పుచున్నాను. నేను అక్రమ సంతానమును పొందాను. అందువలన నేను తప్పు చేశాను అన్న భావము నాలో మిగిలిపోయింది. అదే నాకు బాధగా ఉంది.

మహర్షి :- అక్రమ సంతానమేమిటి? నీవు తప్పు చేయడమేమిటి? నీకు బాధగా ఉండడమేమిటి? ఉన్నది ఉన్నట్లు చెప్పు. దానికి సమాధానమును చెప్పెదను.

మహిళ :- పోయిన సంవత్సరము మీవద్ద ఆశీర్వాదము తీసుకొని బయలు దేరి నేను, నాతోపాటు మరో ఐదుమంది ఆడవాళ్ళు కలిసి అడవిమార్గములో పోవుచుండగా, మా మీద దొంగలు దాడి చేశారు. ప్రక్క పొదలో దాగిన నన్ను ఒక దొంగ కనిపెట్టి, పట్టుకొని నా సొమ్ములు లాగుకోవడమే కాకుండ, నన్ను మానభంగము చేశాడు. ఆ విషయము ఇంతవరకు నేను ఎవరికీ చెప్పలేదు. అలా జరగడము వలన ఈ బిడ్డ పుట్టాడు. నా జీవితములో ఇంతవరకు నా భర్తనే నమ్ముకొని ఉన్నదానిని, ఎప్పుడూ ఏ తప్పు చేయలేదు. ఆ విధముగా జరగడము వలన నాకు బాధగా ఉన్నది. నేను తప్పు చేశాను అను భయము నాలో ఉన్నది.

మహర్షి :- నీ ప్రమేయము లేకుండా జరిగిన పనికి నీవు బాధ్యురాలవు కాదు కదా! అప్పుడు ఆ తప్పును నేను చేశానని అనుకోవడము పొరపాటు కాదా!

మహిళ :- ఇప్పుడు మీ మాట వలన నా తప్పులేదని తెలియుచున్నది. దానికి నేను ధన్యురాలను. అయితే నా మనస్సులో నేను అక్రమ సంతతి పొందానని దిగులుగా ఉన్నది. దానికి విలువైన మీ సలహాను వినాలను కొంటున్నాను.

మహర్షి :- ఈ లోకములో అందరూ బొమ్మలే. ఆడించువాడు వేరుగా ఉన్నాడు. వాడు ఆడించునట్లు మానవ బొమ్మలు ఆడుచున్నవి. ఏ ఆటనైనా ఎవరూ స్వయముగా ఆడలేరు. దేవునికి తెలియకుండా ఏదీ జరుగదు. అక్కడ జరిగినది కూడా ఆయన ఎరుకలేనిది జరుగదు. అదే పనిగా సంతతికావాలని భార్యాభర్తలు ఎన్నోమార్లు కలిసి, ఎంతోకాలము వేచి చూచితే కూడా, రెండు సంవత్సరములకో, మూడు సంవత్సరములకో అంతకంటే ఎక్కువ కాలమునకో, సంతతి కలుగుచుండుట అందరికీ తెలిసిన విషయమే. అటువంటిది, ఒకమారు పురుష సంబంధము కలిగిన వెంటనే అదియే గర్భమునకు కారణము కావడము వింతకాదా! నీ భర్తయొక్క సామత్యమును గురించి నీవు చెప్పినపుడు, నీకు సంతతి కలుగదని తెలిసి కూడా, నా నోటి ద్వారా రాబోయే సంవత్సరము కొడుకును ఎత్తుకొని రమ్మని చెప్పడము వింతకాదా! దారి దోపిడీలో నీవు ఒక్కదానివి ప్రక్కకు పోవడమూ, వచ్చిన వాడు సొమ్ములు తీసుకొని పోకుండా అలా చేయడము కూడా వింతకాదా! నా మాట ప్రకారము నీకు కొడుకు పుట్టడము కూడా వింతకాదా!

మహిళ :- మీరు చెప్పినట్లు ఈ బిడ్డ మీరిచ్చిన వరప్రసాదముగా భావించినా,

ఈ బిడ్డకు నా భర్త తండ్రికాదు కదా! అను సంశయము ఒకప్రక్క పీడించు చున్నది. నా భర్త మాత్రము మీ ఆశీర్వాదము వలన కలిగిన బిడ్డగానే తలచి, తనకు పుట్టిన బిడ్డనే అనుకొనుచున్నాడు. ఆయనకు ఆయన బిడ్డే అని ఉన్నా, నాకు మాత్రము ఈ బిడ్డ ఆయన బిడ్డకాదు అనియే ఉన్నది. ఇటువంటి ఆలోచనలో నేను కులటను కాదా!

మహర్షి :- ఎవరు కులట? ఎవరు కులట కాదు? అనుటకు ఒక సూత్రము కలదు. ఏ తల్లికైనా తన బిడ్డకు తండ్రి ఎవడు అని తెలియనపుడు ఆమెను కులట (లంజ) అని అనవచ్చును. తన బిడ్డకు ఫలానావాడే తండ్రి అని తెలిసియున్నపుడు ఆమెను కులట అనుటకు వీలులేదు.

మహిళ :- బిడ్డకు తండ్రి ఫలానావాడని ఖచ్చితముగా తెలిసినా, తనకు ఇద్దరు పురుషులున్నారని కూడా తెలుసును కదా! తన భర్త వలన కాకుండా ఇతరుల వలన సంతతి పొందడము వ్యభిచారమే కదా! నా పరిస్థితి అదే కదా!

మహర్షి :- నీకు భర్త ఒకడున్నాడు. అతని వలన సంతతి కలుగలేదని తెలుసు, అనుకోని సంఘటన ద్వారా సంతతి కలిగినా అది నీకు సంబంధము లేదు. ఆ దొంగ ఎవరో ముందు తెలియదు, తర్వాతా తెలియదు. నీవు కావాలని చేసిన పనియూకాదు. అందువలన అది వ్యభిచారము కాదు. ఆ పాపమూ నీకు రాదు. బయట ప్రపంచములో భర్త ఒక్కడే కాకుండా మరియొక పురుషునితో సంబంధము పెట్టుకొన్నప్పుడు, పుట్టిన బిడ్డ ఇద్దరిలో ఎవరికి పుట్టాడో తెలియనప్పుడు దానిని వ్యభిచారము అనవచ్చును. ఈ విషయములను, జ్ఞానము తెలిసిన నేనేకాక అజ్ఞానులు కూడా చెప్పగలరు. ఇక జ్ఞానము ప్రకారము చెప్పగలిగితే, నీవే కాదు

జ్ఞానము తెలియని అందరినీ వ్యభిచారులేనని చెప్పవలసివచ్చును. అలా ఎందుకు చెప్పవలసి వచ్చినదనగా! భూమిమీద ప్రతి స్త్రీకి పెళ్ళి కావడము ఒక భర్త ఉండడము సహజమే. అతను కనిపించే భర్తకాగా, ప్రతి స్త్రీకి కనిపించని భర్త ఒకడున్నాడు. జగతిలోని స్త్రీలందరికీ ఆయన ఒకడే భర్త అయినందున ఆయనను "జగద్భర్త" అని కూడా అనుచున్నారు. జగత్తుకంతటికీ భర్త అయినవాడు దేవుడేనని తెలియవలెను. ప్రతి స్త్రీకి తనకు తెలిసినా, తెలియక పోయినా, కనిపించని ఒక భర్త కలడు. యుక్తవయస్సు వచ్చిన తర్వాత స్త్రీకి పెళ్ళైనప్పుడు కనిపించు భర్త వస్తున్నాడు. మొదటి భర్త దేవుడుకాగా, రెండవ భర్తగ ఒక మనిషి రాగలుగుచున్నాడు. ఆ లెక్కప్రకారము పెళ్ళైన ప్రతి స్త్రీకి ఇద్దరు భర్తలు కలరని తెలియుచున్నది. ఇద్దరు భర్తలతోనున్న స్త్రీని వ్యభిచారిణి అనాలి. ఆ విధముగా చూస్తే వ్యభిచారులు కానివారు భూమిమీద ఎవరూ లేరని తెలియుచున్నది.

మహిళ :- నాదొక చిన్న ప్రశ్న, కనిపించే వ్యక్తినే స్త్రీ తన భర్తగా లెక్కించుకుంటుంది కదా! కనిపించని భర్త ఎవరో కూడా ఆమెకు తెలియనపుడు ఆమెకు ఇద్దరు భర్తలున్నట్లు ఎలా లెక్కించగలము? ఒకే భర్తను అంగీకరించిన స్త్రీకి రెండవ భర్త తెలియనపుడు ఆమె వ్యభిచారిణి ఎలా అగును?

మహర్షి :- ఇంతకుముందు ఎవడో ఏమో చేశాడనీ, అతని ద్వారా సంతతి కల్గినదనీ, కనిపించే భర్త వలన సంతతి కలుగకుండా, తెలియనివాడైన ఇతరుని చేత సంతానము కల్గుట వలన అది వ్యభిచారమే కదా! అని నిన్ను నీవు వ్యభిచారిణిగా చెప్పుకొన్నావు. అతనిని (దొంగను) ముందూ చూడలేదు తర్వాతా చూడలేదు. అతనితో పరిచయమూ లేదు. అయినా అతని వలననే సంతతి కల్గినదనీ, తన భర్త వలన కలుగలేదనీ, అలా పొందిన సంతానము అక్రమ సంతానమనీ, అక్రమ సంతానమును పొందిన

నీవు తప్పు చేసినట్లేననీ, వ్యభిచరించినదానినైనట్లే కదాయనీ నీవే నాకు చెప్పావు. నీవు చెప్పిన సూత్రము ప్రకారము, భర్త వలన కాకుండా ఇతరుల వలన సంతతి పొందితే, అది వ్యభిచారమే అయినట్లు లెక్కించనగును. అయితే ప్రతి స్త్రీకి తన భర్త ద్వారా సంతతి జరగనప్పుడు, కనిపించని రెండవ వ్యక్తి ద్వారా సంతతి జరిగినప్పుడు స్త్రీలనందరిని ఏమనాలి? వ్యభిచారులనే అనాలి కదా! ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. ప్రపంచములో ఏ స్త్రీకి సంతానము కల్గినా, ఏ స్త్రీ గర్భమునుండి ఎవరు పుట్టినా, ఆ స్త్రీకి బీజదాతను నేనే, పుట్టినవానికి తండ్రిని నేనే అని భగవద్గీతలో గుణత్రయ విభాగ యోగమున 3,4వ శ్లోకములందు భగవంతుడు స్వయముగా చెప్పాడు.

శ్లో॥ 3. మమయోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్।
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత! ॥

శ్లో॥ 4. సర్వయోనిషు కౌంతేయ! మూర్తయఃసంభవంతి యాః ।
తాసాం బ్రహ్మ మహద్యోనిః అహం బీజప్రదః పితా ॥

ఈ రెండు శ్లోకముల సారాంశమును చూస్తే పుట్టేటటువంటి జీవ రాసులన్నిటికీ నేనే బీజదాతను కావున, ఏ స్త్రీ యోనిలో ఎవరు పుట్టినా, లేక ఏ తల్లి గర్భమునుండి పుట్టిన జీవరాసికైనా, తండ్రిని నేనే అని దేవుడు చెప్పియున్నట్లు తెలియుచున్నది. దీనిప్రకారము ఏ స్త్రీ యొక్క కనిపించే భర్తకు, ఎవరూ పుట్టలేదని తెలియుచున్నది. అలాంటపుడు తమ బిడ్డకు నిజమైన తండ్రి ఎవరో తెలియక, తండ్రిని కానివానిని తండ్రియని చెప్పుట వలన ఆ స్త్రీ వ్యభిచారిణిగా లెక్కించనగును. అట్లుకాకుండా పై శ్లోకముల యొక్క జ్ఞానము తెలిసి, ఏ స్త్రీ అయినా తనకు కనిపించని భర్త

ఉన్నాడనీ, ఆయన వలననే తనకు సంతానము కల్గినదనీ, తన బిడ్డకు నిజమైన తండ్రిని తెలిసినప్పుడు ఆమెది వ్యభిచారము కాదు. అలా కాకుండా దైవజ్ఞానము తెలియని ఏ స్త్రీ అయినా, తన శాశ్విత భర్త, నిజమైన భర్త ఎవరో తెలియని స్త్రీ ఎవరైనా, తన బిడ్డకు తండ్రి ఎవరో తెలియని ఏ స్త్రీ అయినా, తన గర్భమునకు బీజము ఎవరిదో తెలియని స్త్రీ ఎవరైనా, తన భర్త జగద్భర్తయని తెలియక, జీవితము మధ్యలో వచ్చి, మధ్యలో పోవు వ్యక్తిని భర్తగా అనుకొను ఏ స్త్రీ అయినా వ్యభిచారిణే అగును. భారత దేశములో రాజస్థాన్‌లో పుట్టిన మీరాబాయి తనకు భౌతికముగా పెళ్ళైనా, తన నిజమైన మరియు శాశ్వితముగానున్న భర్త జగద్భర్త అయిన శ్రీకృష్ణుడే అని చెప్పింది. కనిపించు భర్తతో కాపురము చేయుచున్నా, మానసికముగా అతనిని భర్తగా ఎప్పుడూ ఆమె ఒప్పుకోలేదు.

మహిళ :- ఇంతకాలము మాకు దైవజ్ఞానము తెలియనిదానివలన కనిపించే భర్తనే మానసికముగా, భౌతికముగా ఒప్పుకొనియున్నాము. మీరాబాయి అట్లుకాకుండా భౌతికముగా కనిపించే భర్తతో కాపురము చేయుచున్నా మానసికముగా కృష్ణున్నే భర్తగా ఒప్పుకొని ఉండడము సరియైన పద్ధతే. కానీ ఇక్కడ ఒక సంశయము వస్తున్నది, అదేమనగా! భౌతికముగా ఒకరు, మానసికముగా ఒకరు ఉన్నపుడు, ఒక స్త్రీకి ఎటు తిరిగి భర్తలు ఇద్దరగు చున్నారు కదా! అప్పుడు ఆమెది వ్యభిచారము కాదా!

మహర్షి :- నేను మొదటే చెప్పాను. దొంగ నిన్ను బలవంతము చేసినపుడు ఆ తప్పు నీకు సంబంధము లేదని చెప్పాను. నీవు భౌతికముగా అతనికి లొంగిపోయినా మానసికముగా నీవు లొంగిపోలేదు. కావున ఆ తప్పు నీది కాదు. ఎక్కడైనా, ఎప్పుడైనా, మానసికముగా దేనినైనా ఒప్పుకొన్నపుడే అది భౌతికముగా జరిగినా, జరుగకపోయినా అది జరిగినట్లే లెక్కించబడును.

అట్లు కాకుండా దేనినైనా మానసికముగా ఒప్పుకోనప్పుడు అది జరిగినా జరగనట్లే లెక్కించబడును. ఈ సూత్రమును తెలియజేయుటకే దేవుడు భగవంతునిగా వచ్చి భగవద్గీతలో కర్మయోగము అను ధర్మమును బోధించాడు. భగవద్గీత చివరిలో మోక్షసన్యాస యోగమను అధ్యాయమున 17వ శ్లోకమందు ముఖ్యమైన సారాంశము గల జ్ఞానమును చెప్పాడు.

శ్లో॥17. యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే ।
హత్వాపి స ఇమాన్ లోకాన్న హన్తి ననిబధ్యతే ॥

**భావము :** ఎవని భావములో అహంకారములేదో, చేయుచున్న పనిమీద ఎవని బుద్ధి, ఆసక్తిలేదో, అతడు ఈ లోకములోని వారందరినీ చంపినా అతడు హంతకుడు కాడు, హత్యాపాపము వానికి అంటదు.

ఈ శ్లోకములో దేవుడు ఒకే చిన్న మాటలో మనము చెప్పుకొన్న సారాంశమంతటినీ చెప్పాడు. భౌతికముగా ఇతరులను చంపినా, మానసికముగా బుద్ధియందు ఆసక్తి లేకుండా, అహంకారము లేకుండా ఆ కార్యమును చేసినా, అతడు ఆ కార్యమును చేసినట్లు లెక్కించబడదు. ఆ కార్యములో వచ్చు పాపము అతనికి అంటదు. హత్య ఒక భయంకరమైన క్రూరమైన పాపకార్యము. అంతపెద్ద పాపకార్యము జరిగినా, ఒక మనిషి చేసినా, అతడు అహంకారము లేకుండా, మనస్సు, బుద్ధియందు ఆసక్తి లేకుండా చేయగలిగితే అతడు హంతకుడు కాదు, హత్యాపాపము అతనికి రాదని దేవుడే చెప్పినపుడు, నీకు ఇష్టము లేకుండా నేను చేసినానను భావము నీలో లేనప్పుడు, అక్కడ జరిగిన మానభంగములోని కర్మ నీకు సంబంధము లేదు. నీవు ఆ పనిని చేసినట్లు లెక్కించబడదు. అందువలన మొదటే నీ తప్పు ఏమీలేదని చెప్పాను కదా!

మహిళ :- ఇంతవరకు దేవుడు చెప్పిన ఈ జ్ఞానము తెలియనిదానివలన నేను చేయని తప్పును నేనే చేశానని అనుకొన్నాను. మీరు ఇప్పుడు చెప్పిన జ్ఞానము వలన నా అజ్ఞానము పటాపంచలైపోయింది. ఈ జ్ఞానమును బట్టి భౌతిక భర్తతో కాపురము చేయుచున్నానని భావమున్న వారు, మానసిక ముగా బుద్ధితో మేమే చేయుచున్నామని అనుకోవడము వలన, వారందరూ నిజమైన భర్తతో కాకుండా రెండవ భర్తతో సంబంధపడినట్లగుచున్నది. కావున లోకములో ఈ జ్ఞానము తెలియనివారంతా వ్యభిచారము చేసినట్లే లెక్కించనగును. మీరు ఇప్పుడు చెప్పిన జ్ఞానము వలన నేను కర్మనుండి బయటపడినట్లు, మిగతావారంతా దేవుడు చెప్పిన జ్ఞానము తెలియగలిగి తన నిజభర్త మీద ఆసక్తి కలిగి, రెండవ భర్తతో ఆసక్తి లేకుండా కాపురము చేయగలిగితే ఆమె వ్యభిచారి కాదు, సంసారియగును.

మహర్షి :- ఇప్పటికి నీవు నిజమైన జ్ఞానమును తెలుసుకొన్నందుకు సంతోషము. పూర్వము జ్ఞానము తెలిసిన పెద్దలు, ప్రజలు జ్ఞానము తెలుసు కొను నిమిత్తము "లంజ బిడ్డకు తండ్రి ఎవడు" అను సామెతను చెప్పారు. దేవుడు చెప్పిన జ్ఞానమును తెలియనంతవరకు మగవారు, ఆడవారు అందరూ వ్యభిచారులే అగుదురు. తమ బిడ్డకు నిజమైన తండ్రి ఎవరో తెలియక, ఇద్దరు భర్తలు కలిగిన వారందరూ వ్యభిచారులే అగుదురు. వారు చేయుచున్న కార్యములలోని పాపము వారిని చేరుచుండును. ఎవని భావములో అహంకారము లేదో, ఎవని బుద్ధియందు చేయుచున్న కార్యములో ఆసక్తిలేదో, వాడు భూమిమీద భౌతికముగా ఏ పనిని చేసినా మానసికముగా చేయనట్లే, వారికి ఆ కార్యములోని ఫలితమైన పాపపుణ్యము లైన కర్మలు అంటవు.

మహిళ :- స్వామీ! మీరు తెలియజేసిన జ్ఞానము వలన, కర్మలనుండి సులభముగా బయటపడుటకు అవకాశము కలదు. ఇంత గొప్ప జ్ఞానమును ఈ కాలములో ఎవరూ చెప్పడము లేదు. ఎందుకు చెప్పలేదు?

మహర్షి :- దేవుడు చెప్పిన జ్ఞానమును తెలియుటకు ఏ మనిషైనా ముందు దేవునిమీద ఇష్టము కలిగివుండాలి. దేవుడు తప్ప పెద్ద ఎవరూ లేరని తెలిసివుండాలి. అప్పుడైతేనే దేవుని జ్ఞానము ఎవరికైనా అర్థమగును. అలా లేనప్పుడు దేవుని జ్ఞానము తెలియదు. వారికి తెలియదు, కావున మీకు చెప్పలేదు. నాకు 120 సంవత్సరములకు జ్ఞానము తెలిసింది. మిగతా వారికి అంతవయస్సుగానీ, అంతశ్రద్ధగాని లేకపోవడము వలన దేవుని జ్ఞానము తెలియలేదు.

## 5. నాన్నను పిలిస్తే అమ్మ పలికిందట

ఇప్పుడు లోకములో కొన్ని సందర్భములలో చెప్పుకొను మరియొక సామెతను చెప్పుకొందాము. ప్రపంచములో ఎందరో ఎన్నో పనులను చేయుచుందురు. ఒక్కొక్కప్పుడు ఒక పనిని చేస్తే ఆ పని జరుగదు గానీ, మరియొక పని జరుగుతుంది. ఒక వ్యక్తి నడుముకున్న మొలత్రాడు బావిలోపడిందని, తన మొలత్రాడుకని బావిలోని నీటిలో మునిగితే మొలత్రాడు దొరకలేదు గానీ, ఒక బంగారు బిందె దొరికిందట. ఆ మనిషి ఒక పని నిమిత్తము బావిలోనికి దిగితే, తన పని జరగకపోవడమే గాక తాను ఊహించని బంగారు దొరకడము జరిగినది. అటువంటి సందర్భములో "నాన్నను పిలిస్తే అమ్మ పలికిందట" అని కొందరు ఆ పనికి తగినట్లు చెప్పుచుందురు. ప్రపంచములో మనుషులు మాట్లాడుకొను

భాషలో సామెతను పొందుపరచడములో ప్రజలకు దైవజ్ఞానము తెలియాలను ఉద్దేశ్యము తప్ప మరి ఏమీ లేదు. ఏ అర్థముతో "నాన్నను పిలిస్తే అమ్మ పలికిందట" అను మాటను ఉంచారో వివరించుకొని చూస్తాము.

ప్రపంచములో పతి సతులైన వారు ఇద్దరూ ఒక బిడ్డకు తల్లి తండ్రులుగా ఉన్నారు. పతి నాన్నగా, సతి తల్లిగా ఉన్నదని ఏ పుత్రుడైనా, ఏ పుత్రికైనా ఒప్పుకోక తప్పదు. ఒక కొడుకు, ఒక కూతురుకు ఒక పతి సతి నాన్నా అమ్మలుగా ఉన్నట్లు, ప్రపంచములోని మనుషులందరికి కలిసి ఒక తండ్రి, ఒక తల్లి కలరు. వారినే ఆది దంపతులు అనికూడా అంటాము. ఇంకా వారినే పరమాత్మ, ప్రకృతియని కూడా చెప్పవచ్చును. అందరికీ తండ్రి పరమాత్మ, కావున ఆయనను సృష్ఠికర్త అని కూడా అంటారు. భూమి మీద కొందరు దేవున్ని తెలియాలని ప్రయత్నము చేయుచుందురు. అటు వంటివారు తప్పుదారి పట్టిపోవునట్లు మాయ చేయుచున్నది. మాయ అంటే ఏమిటి అని వివరించుకొని చూస్తే, అందరికీ అమ్మయిన ప్రకృతియే మాయ అను పేరు కలిగి ఉన్నదని తెలియవలెను. కనిపించే ప్రకృతియే కనిపించని మాయగా ఉన్నది. బయట కనిపించే పంచభూతముల రూపములోనున్న ప్రకృతి, శరీరములోపల కనిపించని గుణముల రూపములో మాయ అను పేరు కల్గియున్నది. బయట ప్రకృతినిగానీ, లోపలి మాయను గానీ దేవుడే తయారు చేసివుంచాడు. మనుషులు ఎవరైనా దేవున్ని తెలియా లని గానీ, దేవునివద్దకు రావాలనిగానీ ప్రయత్నము చేస్తే, వాడు ఎటువంటి వాడో తెలిసిన దేవుడు, వాడు ఆయనకు ఇష్టుడు కాకపోతే వానిని తన వద్దకు రాకుండా చేయుటకు తన మాయకు చెప్పును. అప్పుడు మాయ తానే దేవుడుగా కనిపించి తనవైపు లాగుకొనును. ఆ విధముగా మాయనే దేవునిగా గ్రహించిన మనిషి, అసలు దేవున్ని మరచిపోయి తనకు తెలిసినదే

దేవుడనుకొనును. దేవునికి నచ్చనిది ఎటువంటివాడినైనా, ఆయన సతి అయిన మాయ తన వలనుండి బయటపడకుండా చేసి, దేవునివైపు పోకుండా చేయును. ఈ విధముగా దేవుడు మాయను అడ్డుపెట్టుకొని అందరిని తనవైపు రాకుండా చేసుకొన్నాడు. అందువలన వేమనయోగి తన పద్యమున ఇలా చెప్పాడు.

**పద్యము :** **పతి యొప్పిన సతియొప్పును**
**పతి సతులొకటైన పరమ పావనమందున్**
**పతి సతి న్యాయమె మోక్షం**
**బతులిత పరమాత్మనైక్యముగురా వేమా!**

పై పద్యములో కూడా వేమనయోగి, పతియొప్పిన సతి యొప్పును అన్నాడు. దేవునికి నచ్చినపుడే సతియైన మాయ జీవున్ని తన చేతినుండి విడుచును. ఆయనకు ఇష్టములేనిది ఎవడు కూడా ఆయనవైపు పోలేడు. ఆయనకు ఇష్టుడుకానివానిని మాయ ముందుకు పోనివ్వదు. ఇంత ప్రపంచములో దేవుడు కాని దానిని దేవుడని నమ్మించి, అటువైపు పోవునట్లు చేయును. కానీ దేవునివైపు పోనివ్వదు. అందువలన భగవద్గీతలో కూడా ***"దైవీహ్యేషా గుణమయీ మమ మయా దురత్యయా"*** అని అన్నాడు. దేవుడు సృష్టించిన గుణమయమైన మాయను జయించడము దుస్సాధ్యము అని చెప్పాడు. ఇదంతా ఎవడైనా దేవున్ని తెలుసుకోవాలనుకొన్నప్పుడు జరుగు విధానము. కావున "నాన్నను పిలిస్తే అమ్మ పలికింది" అని అనడము జరిగింది. తండ్రియైన దేవునివద్దకు పోవాలనుకొన్నవానిని, ముందు అమ్మ అయిన మాయ పరీక్షించి, వాడు కపట ప్రేమను తండ్రిమీద చూపుచు నటించువాడైతే ఏమాత్రము తన భర్తవద్దకు పోనివ్వదు. అందువలన

దేవున్ని గురించి తలచితే ముందు మాయ పని చేస్తుంది. దానిని తెలుపుటకు "నాన్నను పిలిస్తే అమ్మ పలికింది" అని పెద్దలన్నారు.

బయట మనుషులను మోసము చేసినట్లు ఎవడుగానీ దేవున్ని మోసము చేయుటకు వీలుకాదు. నిజముగా భక్తి లేకున్నా నీవు తప్ప వేరే దేవుడు లేడనువారు కొందరు కలరు. వారు అలా దేవున్ని పొగడడము వెనుక నిజమైన భక్తివుండదు. వాని పొగడ్త వెనుక ఏదో కాంక్ష ఉండును. ప్రపంచ కోర్కె లేకుండా దేవుడా అని ఎవడూ అనడములేదు. మా దేవున్ని మించిన దేవుడు లేడు, మా దేవుడే నిజమైన దేవుడు అనడములోనే అతని ఆంతర్యము బయటపడిపోవుచున్నది. ప్రపంచానికంతటికీ ఒకే దేవుడు అయినప్పుడు, మీ దేవుడుకంటే మా దేవుడు గొప్ప అని అనడములో దేవున్ని గురించి పూర్తి తెలియకనే, ఆయన శక్తిని అర్థము చేసుకోలేకుండానే, దేవున్నే మభ్యపరిచే మాటలతో పొగడువారున్నారు. అందరి ఆంతర్యము తెలిసిన దేవుడు, ఎవడు తనకు నిజమైన భక్తుడో ఎవడు కాడో తెలియుట వలన, ఆయనకు ఇష్టమైనవానినే తనవద్దకు వచ్చునట్లు చేయును. ఆయనకు ఇష్టము లేనివానిని, ఆయన సతియైన మాయ వానిని దేవునివైపు రాకుండా చేయగలదు. దేవునికి ఇష్టము లేనప్పుడు మాయ ఎవనినీ తన బంధము నుండి విడువక పట్టుకొనును. అందువలన దేవుడా అంటే ముందు నన్ను దాటిపో అంటుంది మాయ. ఆ విషయమునే "నాన్నను పిలిస్తే అమ్మ పలికింది" అని సూక్ష్మముగా పెద్దలు చెప్పారు.

# 6. అర్థములేని జీవితము వ్యర్థము

"అర్థములేని జీవితము వ్యర్థము" అను సామెతను కొందరి సోమరి పోతుల ఎడల వాడుచుందురు. జీవితమునకు ఒక ఆశయము లేకుండా, తమ బ్రతుకు పశువులవలె బ్రతుకునది తప్ప, ఏ సార్థకము లేకుండా జీవితమును గడుపువారిని చూచి, కొందరు పెద్దలు వారిని ఉద్దేశించి "అర్థము లేని జీవితము వ్యర్థము" అని చెప్పడము అక్కడక్కడ చూచాము. కొన్ని మాటలు ఏ సందర్భములో వాడినా, వాటిని యోచించి చూచితే ఎంతో గొప్ప దైవజ్ఞాన సందేశమును ఇచ్చునవై ఉండును. ఇప్పుడు ఈ సామెతలోని భావమును వివరించుకొంటే ఇలా కలదు. ప్రపంచములో జీవమున్న వాటికిగానీ, జీవము లేనివాటికిగానీ స్థూలము, సూక్ష్మము రెండూ ఉండును. స్థూలము అనగా కంటికి కనిపించునదనీ, సూక్ష్మము అనగా కంటికి కనిపించనిదనీ అర్థము. జీవమున్న ఒక కుక్కను తీసుకొని చూస్తే, దానికి భౌతికము, అభౌతికము అను రెండు కలవు. భౌతికము అనగా చూపుకు తెలియు స్థూల శరీరము, అభౌతికము అనగా కంటికి కనిపించని సూక్ష్మ శరీరము రెండూ ఉన్నాయి. అలాగే ఒక జీవములేని ఒక వస్త్రమునుగానీ, ఆహారపదార్థమునుగానీ తీసుకొందాము. వాటిలో కూడా స్థూల, సూక్ష్మములు రెండూకలవు. ఉదాహరణకు పెద్దల పండుగ రోజు పిత్రుల (పెద్దల) పూజలో క్రొత్త గుడ్డలను ఉంచి, పాయసమును, ఆహార పదార్థమును ఒక పాత్రలో ఉంచారు. ఆ పాయసము, అక్కడ ఉంచిన గుడ్డలు అన్నీ తమ పెద్దలకని పెట్టారు. కొన్ని రోజులు గడచిపోయిన తర్వాత, ఆ ఇంటిలో చనిపోయిన వారి పెద్దలు ఒక మనిషిలోనికి పూనకము వచ్చి ఇలా మాట్లాడినారు.

పెద్దలు :- ఏమిరా, ఆస్తినంతా నేను కష్టపడి సంపాదించి మీకిచ్చి పోయాను.

మీరందరూ బాగానే బ్రతుకుతున్నారు. సంవత్సరమునకు ఒకమారు నాకు గుడ్డలు పెట్టితే, అవికూడా చాలా తక్కువ రేటువి తెచ్చి పెట్టారు. నేను బ్రతికివున్నప్పుడు ఎప్పుడైనా అంతరేటు తక్కువ పంచెను కట్టుకొని ఉంటినా? నా సొమ్మును నాకు పెట్టేదానికి మీకు మనస్సు రాలేదా?

కొడుకులు :- నీవు చచ్చిపోయావు కదా! నీకు ఎందుకు గుడ్డలు? పెద్దల పండుగని అందరూ పెట్టినట్లు పెట్టాము. మేము పంచెలు కట్టుకోము కదా! ఖరీదైనవి తెచ్చినా వృథాగా ఉంటాయని తక్కువరేటువి తెచ్చాము.

పెద్దలు :- ఒకవేళ పెద్దల పండుగ రాకపోతే గుడ్డలు కూడా పెట్టేవారు కాదు. చచ్చిపోయావు నీకెందుకు గుడ్డలంటావు కదరా! చచ్చిపోయిన వాళ్ళు ఎంతోమంది ఉన్నారు. వాళ్ళంతా గుడ్డలు కట్టుకుంటున్నారు కదరా! మీ లెక్కలో మేము చచ్చిపోయినా, మా లెక్కలో మేము మరియొకమారు చనిపోవాలి. అంతవరకు మీ మాదిరి తిండి తినవలసిందే, గుడ్డలు కట్టు కోవలసిందే. నాకంటే ఆరు నెలలు ముందు పక్కింటి రంగారెడ్డి చనిపోయాడు కదా! రంగారెడ్డి పెద్దగా ఆస్తి సంపాదించకుండినా, అతని కొడుకులు రంగారెడ్డికి మంచి గుడ్డలు పెట్టారు. నాకంటే బీదవాడైనా, నాకంటే ధనికుని మాదిరి మంచిగుడ్డలు కట్టుకుంటూవుంటే, వానిముందర నేను మీరు పెట్టిన తక్కువ రేటు గుడ్డలు కట్టుకొనేదానికి సిగ్గయితావుంది. మీరు కట్టుకుండే దానికి పనికిరావని తక్కువ రేటువి తెచ్చాము అంటున్నారు. మీరు గుడ్డలు తెచ్చినది మీరు కట్టుకొనేదానికా, నేను కట్టుకొనేదానికా?

కొడుకులు :- బ్రతికుంటే ఎంత ఖరీదైనా పెట్టేవారము. చచ్చిపోయిన వారికి పేరుకు పెట్టేవేగానీ, మీరేమైనా కట్టుకుంటారా?

పెద్దలు :- ఒరే! నేను పూర్తిగా చచ్చిపోలేదురా, మీరు చూచేదానికి మాత్రమే

చనిపోయాను. నేను ఇంకా బ్రతికే ఉన్నాను. నేను మీకు కనిపించకుండా ఇంకా కొంతకాలముండి, నాకు పూర్తిగా చావు వచ్చినప్పుడు చనిపోతాను. అంతవరకు నేను మీలెక్కలో చనిపోయినా, నాలెక్కలో నేను బ్రతికేవున్నాను. నాకూ, మీకు కావలసినట్లు తిండి, గుడ్డ కావాలి...

ఇప్పుడు విషయములోనికి వస్తాము. ఇదంతా మీరు చదువుచూ ఉంటే ఇదేమి వింత! ఈ కాలములో కూడా రాతియుగము నాటి పాత మాటలు చెప్పుచున్నారని అనుకోవద్దండి. మేము చెప్పునది పూర్తి సత్యము. నేడు మనిషికి తెలివి ఎక్కువై, పరిమితి మించి పోయి, కొన్ని విషయములలో పని చేయడము మానివేయడము వలన స్థూల విషయములు తప్ప, సూక్ష్మ విషయములు బుద్ధి గ్రహించ లేకుండా పోయింది. చివరకు మన చావు ఎన్ని రకములు ఉన్నదని కూడా తెలియకుండా పోయినది. మూడు రకముల మరణములలో తాత్కాలిక మరణమును పొందిన ఏసుప్రభువు తిరిగి లేస్తే, దాని విధానము అంతేనని తెలియక, ఒక ప్రక్క నేను చనిపోలేదు అని ఆయనే చెప్పుచున్నా దానిని కూడా పట్టించుకోకుండా, తమకు తెలిసినదే సత్యమనుకొని, మా దేవుడు చనిపోయి తిరిగి లేచాడని చెప్పుకొంటున్నారు. మరణములలో 1) అకాల మరణము 2) తాత్కాలిక మరణము 3) కాల మరణము అని మూడు మరణములుకలవని ఎవరికీ తెలియకుండా పోయినది.

మనిషి భౌతిక శరీరములో భౌతికముకాని మరొక శరీరమున్నదని ఎవరికీ తెలియకుండా పోయిన దానివలన స్థూల, సూక్ష్మముల అర్థమే తెలియకుండా పోయినది. ప్రాణము గల శరీరమునకే కాకుండా, ప్రాణము లేకున్న ప్రతి వస్తువుకు కూడా స్థూలము కాకుండా సూక్ష్మము కూడా ఉన్నదని ఎవరికీ తెలియకుండా పోయినది. చెట్టుకొమ్మలైనాగానీ, మనిషి

శరీర భాగములుగానీ, వస్త్రములోని నూలు ప్రోగుగానీ, నూనెలోనున్న ద్రవముగానీ, ఏదైనా ఒక పదార్థముతోనే తయారై ఉండును. పదార్థమును విడదీసి చూస్తే, ఏ వస్తువులో అయినా పదము ఒకటి, అర్థము మరొకటి కలదు. పద+అర్థము= పదార్థము. ఒక వస్తువు స్థూలముగా నాశనమైనపుడు అందులోని పదము నశించుచున్నది. అర్థము అలాగే మిగిలిపోవుచున్నది. ఒక వస్త్రమును కాల్చినపుడు, అది అగ్నిలో స్థూలముగా కాలి బూడిదయినా, సూక్ష్మముగా మిగిలి ఉన్నది. కాలిన స్థూలము "పదము" కాగా, కాలిపోయిన తర్వాత కూడా కనిపించక, మిగిలి ఉన్న వస్త్రము దానిలోని "అర్థము". చివరకు మీకు బాగా అర్థమగుటకు మేము చెప్పుచున్న సత్యము ఏమనగా! అణువు కూడా పదార్థముతోనే తయారైనది. పరమాణువులో కూడా పదము ఉన్నది, అర్థమూ ఉన్నది. అందువలన అణువుగానీ, పరమాణువుగానీ పదార్థముతో నిండి ఉన్నదని తెలియాలి. దేనిలోనైనా పదము స్థూలముగా, అర్థము సూక్ష్మముగా ఉండునని తెలియవలెను.

విశ్వమునంతటికీ అధిపతి ఒకే ఒక్కడు గలడు. అతడే దేవుడు. దేవునికి పేర్లు లేవుగానీ, ఆయన ఉన్న విధానములే ఆయనకు గుర్తుగా పిలువబడుచున్నవి. దేవుడు అనునది కూడా పేరుకాదు. అలాగే పరమాత్మ, పరంధామ, ఈశ్వర ఇలా ఆయనను ఉద్దేశించి చెప్పునవి ఏవీ కూడా ఆయన పేర్లుకాదని తెలియవలెను. దేవుడు విశ్వమంతా వ్యాపించి ఉన్నాడు. కావున ఆయనను విశ్వవ్యాపి అని పిలువవచ్చును. అలాగే ప్రతి పదార్థములోనూ, ప్రతి వస్తువులోనూ నాశనముగాని అర్థముగా మిగిలి యున్నాడు. కావున ఆయనను (దేవున్ని) "అర్థమ్" అనికూడా చెప్పవచ్చును. ఈ వివరమును బట్టి, దేవుడు అర్థమ్ అనికూడా పిలువబడుచున్నాడు. ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. పుట్టిన ప్రతి మనిషి తనను పుట్టించిన

తండ్రి ఎవరో తెలియకుండా బ్రతికితే, అతని బ్రతుకు వ్యర్థము అని చెప్పవచ్చును. తనను పుట్టించిన తండ్రిని గురించి తెలియనివాడు, తన తండ్రి ఎట్లుంటాడోనని కనీసము విచారించనివాడు పుట్టి కూడా ప్రయోజనము లేదని చెప్పవచ్చును. ప్రపంచములో పుట్టిన ప్రతి మనిషి, దేవుని బీజముతోనే పుట్టుచున్నాడు. దీనినిబట్టి ప్రతిమనిషికీ దేవుడు స్వయముగా తండ్రియై ఉన్నాడు. తన తండ్రిని తెలియనివాడు, తన తండ్రి ఫలానావాడు అని చెప్పనివాడు, పుట్టినా, వాని జీవితము వృథాయనియే చెప్పవచ్చును. దాని ప్రకారము దేవున్ని గురించి జీవితములో తెలియకపోతే వాని జీవితము వ్యర్థము. ఇదే విషయమును చెప్పుటకే "అర్థము లేని జీవితము వ్యర్థము" అను సామెతగా అన్నారు.

"అర్థమ్" అనగా అన్నిటియందు నాశనము కాకుండా ఉన్న దేవుడని తెలియాలి. వ్యర్థము అను పదములో అర్థము కలదు. వ్యర్థము అనుమాటకు ముందు జీవితము కలదు. జీవితము గలవాడు జీవుడు. జీవుడు నాశనము గలవాడు అని తెలుపుటకు వ్యర్థము అను పదమును చెప్పారు. దేవున్ని తెలియనంతవరకు ఆ జీవుడు నాశనమగువాడుగా ఉండును. దేవున్ని తెలిసిన జీవుడు నాశనమగువాడుగా ఉండక నాశనములేనివాడై పోవును, అనగా వాడు అర్థమ్‌గా మారిపోవును. దేవున్ని తెలియనంతవరకు జీవుడు వ్యర్థుడే. కావున పెద్దలు ఎంతో యోచించి "అర్థమ్ లేని జీవితము వ్యర్థమ్" అన్నారు. చూచారా! మన పెద్దలు గతించిపోయినా, వారు చెప్పిపోయిన వాక్యములో ఎంత నిధి దాగియున్నదో? భూమిలో ఎవరో పూడ్చిపెట్టిన నిధులున్నాయని వాటిని వెదకినా, అవి దొరికినా, ఆ నిధిలోని ధనము నీవెంట రాదు. అది నీ కర్మనుమించి ఉపయోగపడదు. మన పెద్దలైన జ్ఞానులు జ్ఞానధనమును భూమిలో కాకుండా, మాటలలో పూడ్చిపెట్టి ఆ

మాటలను (సామెతలను) మన మధ్యలో వదలి వెళ్ళారు. ఇటువంటి మాటల నిధులను తెరచిచూస్తే, అమితమైన జ్ఞానధనము లభించుచున్నది. మాటల నిధుల కొరకు మీరు ప్రయత్నించకున్నా, మాటలలోనున్న జ్ఞాన నిధులను ఎలా తెరవాలో మీకు తెలియకున్నా, ఆ నిధులను తెరచి అందులోనున్న జ్ఞానధనమును మీకు చూపుచున్నది ఈ గ్రంథము. ఇంత సులభముగా జ్ఞాన ధనము దొరుకుచున్నప్పుడు, దాని విలువ తెలియక పోయినా, దానిని స్వీకరించక పోయినా మీ జీవితము అర్థములేని వ్యర్థమే కదా!

## 7. అడుగు తప్పితే అరవైఆరు గుణములు

ఇప్పుడు మరొక జ్ఞాన నిధియైన సామెతను చూస్తాము. "అడుగు తప్పితే అరవై ఆరు గుణములు" ఆరు ప్రక్కన ఆరు ఉంచితే దానిని విడిగా చెప్పితే ఆరు మరియు ఆరు (6,6) అని చెప్పవచ్చును. రెండు ఆర్లను కూడి చెప్పితే పన్నెండు (6+6=12) అని చెప్పవచ్చును. అట్లు కాకుండా రెండు ఆర్లను విడిగాగానీ, కలిపిగానీ చెప్పకుండా, వరుస క్రమములో పెద్ద సంఖ్యగా చెప్పితే, ఆరవై ఆరు (66) అని చెప్పవచ్చును. సామెతలో 66 అని వారు మాటలతో మూసిపెట్టారు. కనుక వాటిని మొదట చెప్పుకొన్నట్లు విడివిడిగానే చెప్పుకోవలసి వస్తున్నది. అలా ఎందుకు చెప్పుకోవాలని తెలియాలంటే, వాటికి సంబంధించిన సమాచారమును కొంత ముందే తెలుసుకోవాలి. మనిషి శరీరములో తలయందు మాయ అనునది ఉన్నదని తెలియవలెను. మాయ అను దానిని దేవుడే తయారు చేసి యుంచాడు. అందువలన ***"దైవీహ్యేషా గుణమయీ మమ మాయ"*** అని భగవద్గీతలో విజ్ఞానయోగమున 14వ శ్లోకమందు, భగవంతుడు చెప్పాడు.

దేవుడు మాయను గుణముల రూపముతో తయారు చేసి యుంచాడు. "మమ మాయా" అని శ్లోకములో చెప్పడము వలన మాయ తనదేనని చెప్పినట్లు తెలియుచున్నది.

పరమాత్మ భర్తకాగా, ప్రకృతి భార్యగా ఉన్నది. పతి సతులుగాయున్న పరమాత్మ, ప్రకృతి ఇద్దరు కలిసి కాపురము చేయుట వలన, ఇంత జగతి ఏర్పడినది. దేవునికి భార్యగా ఉన్న ప్రకృతియే సర్వజీవరాసులకు తల్లిగా ఉన్నది. దేవుడు తన భార్యను రెండు ఆకారములుగా ఉండునట్లు చేశాడు. ప్రకృతియైన తన భార్యకు రెండవ వేషముగా ఉండునట్లు చేసి, రెండవ రూపముగానున్న ఆమెకు మాయ అని పేరు పెట్టాడు. ప్రకృతిగానున్న ఒక భార్యకు ఒక పనిని, మాయ పేరుతోనున్న రెండవ భార్యకు ఒక పనిని అప్పజెప్పాడు. తన భర్త చెప్పినట్లు ఇరువురు భార్యలు పనులు చేయు చున్నారు. గుణరూపములోనున్న రెండవ భార్య అయిన మాయ మనుషుల తలలయందు నివాసము చేయుచున్నది. దేవునికి మొదటి భార్య అయిన ప్రకృతి చరప్రకృతి, అచరప్రకృతియని రెండు భాగములుగా ఉన్నది. ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదు భాగములుగా అచర ప్రకృతి ఉండగా, సకల జీవరాసుల శరీరములుగా చరప్రకృతి ఉన్నది. ఇకపోతే రెండవ భార్యగా ప్రకృతినుండి (మొదటి భార్యనుండి) విడివడి వచ్చిన మాయ కూడా, కనిపించని ఆకారము కలదై రెండు భాగములుగా ఉన్నది. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సర అను ఆరు జీవునికి శత్రు గుణములుగా ఒక భాగముండగా, దాన, దయ, ఔదార్య, వైరాగ్య, వినయ, ప్రేమ అను ఆరు జీవునికి మిత్ర గుణముల గుంపుగా రెండవ భాగమున్నది.

దేవునికి సతియైన ప్రకృతి కనిపించు ప్రపంచముగా మరియు జగతిగా ఒక ఆకారమును, కనిపించని మిత్ర మరియు శత్రు గుణములను మాయ ఆకారమును కలిగి విశ్వమంతా వ్యాపించియున్నది. దేవుడు విశ్వమంతాయున్నాడు. ఆయన సతీమణి కూడా ఆయనతోపాటు విశ్వ మంతా వ్యాపించియున్నది. మాయ చెడు గుణములుగా లేక శత్రు గుణములుగా కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సర అను ఒక ఆరు (6) గుణములుండగా, మంచి గుణములుగా లేక మిత్ర గుణములుగా దాన, దయ, ఔదార్య, వైరాగ్య, వినయ, ప్రేమ అను మరొక ఆరు (6) గుణములు ఉండగా మొత్తము ఆరు, ఆరు (6,6) రెండు భాగములుగా తెలియుచున్నది. మన శరీరములో తల భాగములో నాలుగు చక్రముల సముదాయము కలదు. తల మధ్యలోగల నాలుగు చక్రముల ఆకారమును తర్వాత పేజీ పటములో చూడవచ్చును.




బ్రహ్మా, కాల, కర్మ, గుణచక్రములు

క్రింది చక్రమునుండి వరుసగా చెప్పుకుంటే 1) గుణచక్రము 2) కర్మచక్రము 3) కాలచక్రము 4) బ్రహ్మచక్రము. క్రిందిగల గుణచక్రములో మాయ నివాసమున్నది. ఆ చక్రములోనే శరీరములోని జీవుడు నివసిస్తున్నాడు. మాయ తామస, రాజస, సాత్త్విక అను మూడు తెగలుగా ఉన్నది. జీవుడు చేసుకొన్న కర్మనుబట్టి ఈ మూడు విధముల మాయలో ఏదో ఒక మాయలో చిక్కుకోవడము జరుగుచున్నది. జీవుడు ఏ తెగ గుణములలో ఉన్నా అతను మాయలో ఉన్నట్లే. ఒకే మాయ, మంచి చెడు అను రెండు భాగములుగా ఉంటూ, పెద్ద మాయ, మధ్య మాయ, చిన్న మాయ అను మూడు తెగలుగా ఎలా ఉన్నదో క్రింద చిత్రములో చూడండి.




**గుణచక్రము**

నాలుగు భాగములుగా కనిపిస్తున్న చక్రమునే గుణచక్రము లేక మాయచక్రము అని అంటున్నాము. ఈ చక్రములోని బయటనుండి మూడు భాగములు తామస, రాజస, సాత్త్విక భాగములుగా ఉన్నాయి. మొదటిదైన తామస భాగమును పెద్దమాయ అనియూ, మధ్యలోని రెండవదైన రాజస భాగమును మధ్యమాయ అనియూ, మూడవదైన సాత్త్విక భాగమును

చిన్నమాయ అనియూ చెప్పగలము. శరీరములోని జీవుడు ఏదో ఒక భాగములో వుండి మాయలోనే చిక్కుకొని ఉన్నాడు. మనిషికి, మనిషికీ ఆయా జీవుడు నివసించు మాయలో చిన్న, మధ్య, పెద్ద అను తేడాలుండ వచ్చును గానీ, మనిషిలోని జీవుడు మాత్రము, ఏదో ఒక మాయలో చిక్కుకొని ఉన్నాడు. ఆ చిత్రములను క్రింద చూడవచ్చును.



తామస భాగములో జీవుడు.



రాజస భాగములో జీవుడు.



సాత్త్విక భాగములో జీవుడు.

చిన్నమాయ, మధ్యమాయ, పెద్దమాయ అని మాయ మూడు రూపములుగా ఉండడమేకాకుండా, ప్రతి భాగములోను మంచి, చెడు రెండు గుణములుగా ఉన్నది. తామస, రాజస, సాత్త్వికములను మూడు భాగములుగానున్న మాయలో ఏదో ఒక భాగమున, మనిషిలోని జీవాత్మ చిక్కుకొని ఉన్నది. ప్రతి భాగములోను ఆరు చెడు గుణములు, ఆరు మంచి గుణములున్న దానివలన ఆ విషయమును గుట్టుగా అరవై ఆరు (66) గుణములని సామెతలో చెప్పారు. గుట్టును రట్టు చేసి చూచితే ఆరవై ఆరు కాదు అనియూ, ఆరు మరియు ఆరు (6,6) అనియూ తెలియు చున్నది. మధ్య గుణభాగములో ఉన్న జీవుడు ఎటు పోయినా, ఇటు సాత్త్వికములోనికి పోయినా, అటు తామసములోనికి పోయినా, ఏ భాగములో నైనా ఆరు మరియు ఆరు గుణములే ఉన్నవి. అందువలన "అడుగు తప్పితే అరవై ఆరు గుణములు" అని సామెతలో చెప్పారు. ఈ సామెత

వలన కనిపించని మాయ యొక్క నిజరూపము కంటికి కనిపించునట్లు తెలియుచున్నది. ఇటువంటి సామెతను తయారు చేసి చెప్పిన పెద్దలకు మనము ఎప్పటికీ రుణపడియే ఉంటాము.

## 8. అతి రహస్యము బట్టబయలు

ఎవ్వరికీ తెలియకుండా ఉండే విషయమును రహస్యము అంటాము. ఒకవేళ రహస్యముగా ఉన్నదానిని ఎవడైనా, వానికి తెలిసి చెప్పినా విన్న వానికి తెలియకుండా పోతే, దానిని రహస్యములలో మెరుగైన రహస్యము అనవచ్చును. ఒక రహస్యము ఎప్పుడో ఒకమారు బయటకు వచ్చినా, దానిని మొదట తెలుసుకొన్నవాడు ఇతరులకు చెప్పినా, మొదట చెప్పిన వానికిగానీ, తర్వాత విన్నవారికి గానీ ఎవరికీ తెలియని సమాచారమును అతి రహస్యము అని అనవచ్చును. ఎవరికీ తెలియని రహస్యమును ప్రజలకు తెలియజేయు నిమిత్తము ఆకాశవాణి ఒక గురువుగారికి చెప్పింది. గురువువద్దకు వచ్చే వారందరికి ఆ రహస్యమును ఆయన తెలియజేస్తాడనీ, ఆకాశవాణి రహస్య విషయమును గురువుకు తెలిపినది. ఆకాశవాణి చెప్పిన రహస్యమును గురువు విన్నాడు. గురువు ఆకాశవాణి చెప్పగా వినిన రహస్యమును, విన్నది విన్నట్లు ప్రజలకు తెలియజేశాడు. అయినా ఆకాశవాణి చెప్పిన విషయము అతి రహస్యముగానే మిగిలిపోయింది. చెప్పినా అదెలా రహస్యముగా మిగిలిపోయింది అని ఎవరికైనా ఆశ్చర్య మగును కదా! ఆ విషయమును చెప్పినా అది ఎందుకు రహస్యముగా ఉందో వివరించుకొందాము. దానికి ఒక ఉదాహరణను చూస్తాము.

ఒక ఊరి బయటగల గుడిలో 'వంద' అను పేరుగల దేవత ఆ ఊరిలోని ప్రజలను నెలకొక్కరిని చంపివేయుచుండెను. ప్రతి అమావాస్యకు ఒక మనిషి ఆ గుడిముందరకు పోయి చనిపోయేవాడు. ప్రతి అమావాస్యకు అలా జరగడము వలన గుడికీ ఆ మరణాలకూ ఏదో సంబంధముందని కొందరు మేధావులు గ్రహించారు. ఆ విషయమునకు సంబంధించిన సమాచారము ఏమైనా తెలుస్తుందేమోనని, ఊరిబయటనున్న గుడివద్దకు పోయి అక్కడ జాగ్రత్తగా పరిశీలించారు. అక్కడ వెదకగా వారికి ఒక శిలా ఫలకము కనిపించింది. ఆ శిలా ఫలకము మీద ఇలా వ్రాసివున్నది. " ఈ దేవతను ప్రతిష్ఠించిన తర్వాత వంద సంవత్సరములకు ఈ గుడిలోని ప్రతిమలోగల దేవత పోయి, రెండవ దేవత గుడిలోని ప్రతిమలోనికి వచ్చి చేరును. అలా వచ్చిన రెండవ దేవత నెలకొక మనిషిని బలిగా తీసుకొని చంపివేయుచుండును. ప్రతి నెల జరుగు ప్రాణ నష్టమును నివారించాలంటే నూరుగంటల కాలము, ఒక మంత్రమును ఏకధాటిగా జపించి, చివరిలో దేవతకు పూజ చేసిన, అంతటితో ఆ దేవత శాంతించి నరబలిగా మనుషులను చంపు పనిని మానుకొనును." అని వ్రాసిన దానిని చూచారు. ఆ దేవతకు, వంద అను పదమునకు సంబంధముండుట వలన, మంత్రములో కూడా వంద అను పదము కలదు. ఆ దేవతవద్ద జపించవలసిన మంత్రము "ఓం వంద ఏమాత్రము స్వాహా" శిలాఫలకము మీద వ్రాసిన మంత్రమును చూచిన మేధావులు, ఆ పూజ చేయుటకు ఒక వ్యక్తిని ఏర్పాటు చేశారు. ఆ వ్యక్తి కూడా శిలాఫలకమును ఒకమారు చదివి వచ్చాడు. ఊరి శ్రేయస్సు కొరకు ఒక రోజు పూజను ప్రారంభించాలనుకొన్నారు.

ఆ గుడివద్ద నెలకొక మనిషి ఎందుకు చనిపోవుచున్నాడో అది ఎవరికీ తెలియని రహస్యము. అయినా ఒక శిలాఫలకము మీద వ్రాయబడిన వ్రాతనుబట్టి మరణాల రహస్యము అందరికీ తెలిసిపోయినది. మరణాలు జరుగకుండా ఉండుటకు, చేయవలసిన తంతు కూడా తెలిసిపోయినది. అలా చేయుటకు అంతా సిద్ధము చేసుకోవడము కూడా జరిగినది. చివరకు ఎవరికీ తెలియని మరణముల రహస్యము బట్టబయలైపోయి అందరికీ తెలిసిపోయినది. ఆ ఊరివారు శిలాఫలకము మీద ఉన్నట్లు మంత్ర జపము చేసి, పూజ చేయుటకు పూనుకొని, మంత్రజపము చేసి, పూజ చేయుటకు మనిషిని తయారు చేసి, ఒక దినము ఆ కార్యమునకు పూనుకొన్నారు. పూజా కార్యమునంతటినీ తయారు చేసుకొన్న మనిషి, ఏకధాటిగా మంత్రమును జపించను మొదలుపెట్టాడు. మంత్రములో ముఖ్యమైన శబ్దము వంద. వందకు ఆధారముగా 'ఏమాత్రము' అని ఉన్నది. మంత్రమును జపించు వ్యక్తి "ఓం వంద ఏమాత్రము స్వాహా" అనబోయి, "ఓం వందే మాత్రము స్వాహా" అనను మొదలుపెట్టాడు. ఆ విధముగా మంత్రమును వంద గంటల కాలము ఏకధాటిగా చదివి, చివరిలో దేవతా పూజను ఘనముగా చేశారు. అంతటితో తమ కష్టాలు తీరిపోయి, నెలకొకమారు జరుగు మారణ హోమము ఆగిపోవునని సంతోషించారు. ఆ గుడివద్ద శుభ్రము చేసి గుడి ప్రక్కనే రోడ్డు కూడా వేయడము జరిగినది. రోడ్డు వేయునప్పుడు శిలాఫలకము కూడా మట్టిలో పూడిపోయింది.

శిలాఫలకముతో పని అయిపోయిందనుకొని అక్కడి వారు ఎవరూ దానిని పట్టించుకోనందున అది మట్టిలో పూడిపోవడము జరిగినది. గుడి వద్ద హడావిడి అంతా అయిపోయి అందరూ ఊపిరి పీల్చుకొన్నారు. అంతలోనే ఒక నెల గడచిపోయినది. అమావాస్య రానే వచ్చింది.

అమావాస్య గడచిపోయిన మరుసటి దినము, గుడిముందర ఆ ఊరిలోని వ్యక్తి రక్తము కక్కుకొని చనిపోయాడు. ఆ వార్త ఊరిలోని వారందరికీ తెలిసి ఆశ్చర్యపోయారు. తాము చేయవలసినదంతా చేసినా, తిరిగి మొదటి వలె జరగడము వారికి భయమును పుట్టించినది. వెంటనే ఆ ఊరిపెద్ద తనకు పరిచయమున్న, అన్ని విద్యలూ తెలిసిన వ్యక్తితో కలిసి జరిగిన విషయమంతటిని వివరించి చెప్పాడు. ఆ వృత్తాంతమంతయు వినిన ఆ పండితుడు, పూజా కార్యక్రమమును నిర్వహించిన వ్యక్తిని పిలిచి, ఆయన చేసిన కార్యక్రమమును గురించి అడిగాడు. అప్పుడు పూజా కార్యమును నిర్వహించిన వ్యక్తి తాను చేసినదంతా పూసగుచ్చినట్లు చెప్పాడు. తాను నూరుగంటల కాలము ఏకధాటిగా జపించిన మంత్రమును గురించి కూడా చెప్పాడు. అదంతావిన్న పండితుడు, మంత్రము మీద అనుమానము వచ్చి మంత్రమును చెప్పమని అడిగాడు. అప్పుడు తాను జపించిన మంత్రము "ఓం వందే మాత్రము స్వాహా" అని జపించిన వ్యక్తి చెప్పాడు. ఆ మంత్రమును వినిన పండితుడు, ఇక్కడే తప్పు జరిగిందని చెప్పాడు. అదెట్లు జరిగిందని ఊరిపెద్ద, పండితున్ని ప్రశ్నించాడు. అప్పుడు పండితుడు ఇలా చెప్పాడు.

"ఆ గుడిలో ఉన్నది ఆడదేవత కావున మంత్రములో మాత అని ఉండవలసిన చోట మాత్ర అని పలకడము వలన, మంత్రోచ్చాటనలో దోషమేర్పడి, ఆ పూజ ఫలించలేదు. అందువలన మీరు చేసిన పని యంతయు వృథా అయినది" అని అన్నాడు. ఊరిపెద్ద శిలాఫలకమునూ దానిలోని మంత్రమునూ చూచియుండుట వలన, అతనికి మంత్రములో, మాత్రము అని ఉండడము బాగా జ్ఞప్తికి ఉండుట వలన, అదేమాటను పండితునితో "శిలాఫలకము మీద మాత్రము అను పదము ఉండుట నేను

కూడా చూచాను. అలాగే మంత్రమును జపించడము జరిగినది. జపించిన ఈ వ్యక్తిది తప్పేమిలేదు" అని అన్నాడు. ఆ మాట విన్న పండితుడు దీర్ఘముగా ఆలోచించి ఇలా అన్నాడు "అయితే శిలాఫలకము మీద వ్రాయు వారు పొరపాటుగా మాత అని వ్రాయబోయి మాత్ర అని వ్రాసివుందురు. ఎలాగయితేనేమి జరిగిన పొరపాటు తెలిసిపోయింది కదా! తప్పును సరిదిద్దుకొని ఈ మారు సక్రమముగా పూజ చేస్తే సరిపోతుంది." అని పలికాడు. అప్పుడు ఊరిపెద్ద పూజ కార్యక్రమమును చేయుటకు, ఆ పండితున్నే ఒప్పించాడు. ఒక శుభ ముహూర్తమున ఆ పండితుడు ఊరి బయటగల గుడివద్ద పెద్దగా పూజా కార్యక్రమమును ఏర్పాటు చేసి, వందగంటల పాటు మంత్రమును జపించెను. ఈ మారు పండితుడు జపించిన మంత్రము "ఓం వందే మాతము స్వాహా" అని జపించాడు.

మొదట శిలాఫలకము మీద వ్రాయబడియున్న మంత్రము "ఓం వంద ఏమాత్రము స్వాహా" అని ఉండగా, పూజను నిర్వహించిన వ్యక్తి మంత్రములో వంద అను పదము ఉండదు, నమస్కారమును తెలుపు అర్థమునిచ్చు వందే అని ఉంటుంది. అయితే అది వ్రాయడములో వంద ఏ మాత్రము అని పొరపాటుగా వ్రాశారు అని అనుకొని, వంద+ఏ వందే అని చేశాడు. రెండవ పండితుడు మాత్రను చూచి మాత అని ఉంటుంది, పొరపాటుగా మాత్ర అని వ్రాశారని అనుకొని మంత్రమును ఓం వందే మాతము స్వాహా" అని వ్రాసుకొన్నాడు. అసలు మంత్రము వంద అను పేరు కల దేవతది. కావున ఆమె పేరుకు గుర్తుగా వంద అను పదమును పెద్దలు ఉంచగా, ఆ మంత్రము "ఓం వంద ఏమాత్రము స్వాహా" అయినది. వంద ఏమాత్రము అనగా, వంద దేవత ఎంత గొప్పదైనదీ ఎవరికీ తెలియదు అను అర్థము వచ్చునట్లు, 'ఏమాత్రము స్వాహా'ను చేర్చి ఓం వంద

ఏమాత్రము స్వాహా అని అసలు మంత్రమును చెప్పగా, మొదటి పండితుడు ఆ మంత్రమును "ఓం వందే మాత్రము స్వాహా"గా మార్చివేశాడు. రెండవ పండితుడు, అతని తెలివితో మంత్రమును మార్చి "ఓం వందే మాతము స్వాహా" అని చెప్పాడు.

**ఓం వంద ఏమాత్రము స్వాహా (శిలాఫలకము మీది అసలు మంత్రము)**

**ఓం వందే మాత్రము స్వాహా (మొదటి పండితుడు మార్చిన మంత్రము)**

**ఓం వందే మాతము స్వాహా (రెండవ పండితుడు మార్చిన మంత్రము)**

ఊరిబయట గుడివద్ద, మనుషుల మరణములు ఎందుకు జరుగుచున్నవో తెలియనిది రహస్యముకాగా, ఇదీ కారణమని శిలాఫలకము మీది వ్రాత, ఆ రహస్యమును అందరికీ తెలియునట్లు బట్టబయలు చేసినది. శిలాఫలకము మీద రహస్యము బట్టబయలైనా శిలాఫలకము చెప్పిన దానిని పండితుల మనోభావములు మార్చుట వలన, రహస్యము చెప్పినా రహస్యముగానే మిగిలిపోయింది. తెలియనిది రహస్యముకాగా, దానిని తెలిపి బట్టబయలు చేసినపుడు, అతి రహస్యము బట్టబయలు అని చెప్ప వచ్చును. చెప్పినా అర్థముకానపుడు రహస్యము అతి రహస్యమగుచున్నది. రహస్యము గురించి చెప్పినది ఉండగా, దానిని బట్టబయలు అని కొందరు అంటున్నారు.

మనము ఉదాహరణకు ఎట్లు చెప్పుకొనినా, వాస్తవముగా ప్రపంచములో అతి రహస్యమైనది ఒకే ఒక్కటి కలదు. అదియే దైవము. దేవుడు సృష్ట్యాదినుండి రహస్యముగా ఉన్నాడు. ఇంతవరకు దేవున్ని చూచినవాడు ఎవడూ జగతిలో లేడు. అందువలన ఆయనను దేవులాడబడేవాడు దేవుడు అన్నారు. అంత రహస్యమైన దేవుడు, ఎప్పుడూ మన ఎదురుగానే ఉన్నాడు. ఎదురుగానే కాదు వెనుక కూడా ఉన్నాడు. దేవుడు ప్రపంచమంతా

అణువణువునా వ్యాపించియున్నాడు. దేవుడు ఎంత రహస్యమైనవాడైనా గుడివద్ద శిలాఫలకము మీద వ్రాసి పెట్టినట్లు, రహస్యమైన దేవుని గురించి అందరికీ తెలియునట్లు, భగవద్గీతలో పూర్తిగా వ్రాయబడినా, మనిషి స్వంత భావములను కల్పించుకొని, గీతలో చెప్పిన దానిని వదలి, వేరు విధానములో ఉండుట వలన, ఎంతో రహస్యమైనవాడు అంతటా వ్యాపించి బట్ట బయలుగా ఉన్నా, రహస్యమైన దేవున్ని తెలియక మనిషి వెదుకుచునే ఉన్నాడు. దేవుడు అంతటా వ్యాపించి, దాపరికములేని జ్ఞానము కలిగియుండి, ఎవరికీ తెలియని రహస్యముగా ఉండుట వలన, ఆ విషయము అర్థమగుటకు పెద్దలు "అతి రహస్యమ్ బట్టబయలు" అను సామెతగా చెప్పారు.

**బట్టబయలు :** అంతటా వ్యాపించినవాడు, తెర తీసిన దృశ్యము కనిపించునట్లు కనిపించును.

**చూచువాడు :** జీవుడు, చూపించువాడు గురువు. దేవున్ని తెలిస్తే దేవుడు బట్టబయలు. తెలియకపోతే దేవుడు అతి రహస్యము.

ప్రతి అమావాస్యకు మరణమున్నట్లు, ప్రతి జన్మకు మరణమున్నది. అమావాస్యను మరణమును తప్పించుకొనుటకు మంత్ర జపము, పూజ తప్పనిసరియైనట్లు, జన్మనూ, మరణమునూ తప్పించుకొనుటకు జ్ఞానము, యోగము తప్పనిసరిగా ఉన్నది. శిలాఫలకము మీది మంత్రమును తప్పుగా అర్థము చేసుకొనుట వలన, అమావాస్య మరణములు తప్పనట్లు, భగవద్గీతలో బోధను తప్పుగా అర్థము చేసుకొనుటవలన జనన మరణములు తప్పలేదు.

## 9. అందం, చందం లేని మొగుడు మంచం నిండా ఉన్నట్లు

సృష్టికర్తయిన దేవునికి పేరులేదు, ఆకారములేదు. అందువలన ఆయనను రూపం, నామం లేనివాడన్నారు. పేరుగానీ, అందముగానీ లేనివాడు దేవుడని, అందరికీ తెలియకున్నా కొందరికైనా తెలియును. కంటికి కనిపించని దేవుడు ఎక్కడున్నాడని ఎవరైనా అడిగిన, ఇక్కడున్నాడని చెప్పలేము. ఎందుకనగా దేవుడు సర్వవ్యాపి, అణువణువునా వ్యాపించిన వాడు. ఆయన లేనిచోటంటూ ఏదీ లేదు. ఈ విషయమును భగవద్గీతలో ఎన్నోమార్లు దేవుడే చెప్పాడు. ఉదాహరణకు విజ్ఞానయోగమున 7వ శ్లోకముయందు...

శ్లో॥ 7: మత్తః పరతరం నాన్యత్ కించి దస్తి ధనంజయ ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రేమణిగణా ఇవ ॥

**భావము :** నన్ను మించి పేరుపొందినది జగతిలో ఏదీలేదు. దారమందు మణులు కూర్చబడినట్లు, సకల లోకములందు నేను వ్యాపించియున్నాను.

ఇక్కడ ఈ శ్లోకములో చెప్పినట్లు, విశ్వమంతా వ్యాపించియున్న దేవున్ని ఎవరూ చూడలేదు. ఎవరికీ కనిపించకయున్న దేవుడు, జగత్తులో అందరినీ భరించువాడుగా ఉన్నాడు. కావున ఆయనను జగద్భర్త అని అన్నారు. ప్రతి మనిషికీ భర్తగాయున్న దేవుడు, ప్రపంచమంతా వ్యాపించియుండడమే కాకుండా రూప, నామములు లేని వాడుగా ఉండుట వలన, ఆయన విధానమును ఒక్క మాటలో సామెతగా చెప్పుటకు "అందం, చందం లేని మొగుడు మంచం నిండా ఉన్నట్లు" అన్నారు. రూపము, పేరు లేనివాడు కావున దేవున్ని, అందం, చందం లేని అని అన్నారు. దేవుడు అందరినీ భరించువాడు కావున, ఆయనను అందం చందం లేని

మొగుడు అన్నారు. దేవుడు ప్రపంచమంతా మరియు జగమంతా వ్యాపించియున్నాడు. కావున మంచం నిండా ఉన్నట్లు అన్నారు. "అందం చందం లేని మొగుడు మంచం నిండా ఉన్నట్లు" అని అనడములో పేరు, రూపము లేని దేవుడు విశ్వమంతా వ్యాపించియున్నాడని తెలియుచున్నది.

అందం, చందం లేని = రూపము, పేరులేని
మొగుడు = భరించు దేవుడు
మంచం నిండా ఉన్నట్లు = విశ్వమంతా వ్యాపించి ఉన్నాడు.

## 10. అన్నీ ఉన్నాయి గానీ ఐదవ తనం లేదు.

ఒక చిన్న ఊరిలో ప్రాథమిక పాఠశాల ఉండెను. ప్రాథమిక పాఠశాలలో మొత్తము ఐదు తరగతులు ఉండగా, పాఠములను బోధించు బోధకుడు (టీచర్) ఒక్కడే ఒక్కడుండెను. ఆ ఒక్కడు ఎంతగా చెప్పినా నాలుగు తరగతుల వరకు చదువు చెప్పుటకే కాలము సరిపోవుచుండెను. ఐదో తరగతి పిల్లలు లేకపోవడము వలన నాలుగు సంవత్సరములు ఏ ఇబ్బంది లేకుండా గడచిపోయినది. నాల్గవ సంవత్సరము నాల్గవ తరగతి పాసయిన విద్యార్థులు ఐదవ తరగతిలో కూర్చున్నా, వారికి ఆ తరగతిలో విద్య చెప్పువారు లేకపోవుటచే, ఐదవ తరగతి పిల్లలు కూడా నాల్గవ తరగతిలోనే కూర్చోవలసి వచ్చినది. ఐదవ తరగతి ఉన్నా, ఐదవ తరగతికి పాఠము చెప్పు బోధకుడు లేనట్లు, ఒక స్త్రీకి తనకు ప్రత్యేకమైన భర్త లేక అక్క మొగుడునే భర్తగా చెప్పుకోవలసి వచ్చినది. ప్రాథమిక విద్యార్థులకు ఐదవ తరగతియున్నా బోధించే టీచర్ లేకపోవడము వలన నాల్గవ తరగతిలోనే కూర్చున్నట్లు, ఐదవ తనమైన ప్రత్యేక భర్తలేక అక్క మొగునినే

భర్తగా చెప్పుకొన్నట్లు, ఒక మనిషికి నాలుగు పోషక పదార్థములతో కూడుకొన్న ఆహారమున్నా, ముఖ్యమైన ఐదవదైన జీర్ణక్రియలేనట్లు, మనిషికి అన్నీ ఉన్నా ఐదవ తనము లేదని ఈ సామెతలో చెప్పడమైనది.

ప్రాథమిక పాఠశాలలో చివరిదీ, గొప్పదీ, అంతటితో పూర్తి అయి పోవునదీ ఐదవ తరగతి. అయితే నాలుగు తరగతులు, అందులో చదువు లున్నా ఐదవ తరగతిలో బోధకుడూ లేడట, చదువూ లేదట. అలాగే స్త్రీకి వయస్సు వచ్చిన తర్వాత స్వంత పురుషుడు లేనట్లు, పోషక పదార్థములున్నా జీర్ణక్రియ లేకపోతే ఎట్లుండుననగా! ఐదవ తరగతి చదువు లేకపోతే తర్వాత ఐదవ తరగతి విద్యార్థి అను పేరు వానికి లేకుండా పోవుచున్నది. అలాగే యుక్తవయస్సు వచ్చిన స్త్రీకి భర్తలేకపోతే, ఆమెకు సంసారి అను పేరు లేకుండా పోవును. అలాగే పోషక పదార్థములున్న బలమైన ఆహారమున్నా, జీర్ణక్రియ లేకపోతే, వానికి ఆరోగ్యవంతుడను పేరు లేకుండా పోవును. అలాగే మనిషిలోని జీవుడు, తామస, రాజస, సాత్త్విక, యోగ అను నాలుగు స్థానములను దాటివచ్చి, ఐదవ దానిలోనికి యోగ్యుడైనవాడు, అందులో వాడు అనుభవించునది ఏమీ లేదు. నాలుగు స్థానములలో ఏదో ఒకటి అనుభవించిన జీవుడు, ఐదవస్థానమైన ముక్తి అను స్థానములో అనుభవించు నది ఏమీలేక, ఏమీకానివాడైపోవుచున్నాడు. ముందు నాలుగు స్థానములను అనుభవించిన జీవునికి, ఆయా స్థానముల అనుభవములనుబట్టి తామసుడు, రాజసుడు, సాత్త్వికుడు, యోగి అను పేర్లు వచ్చినా, ఐదవ స్థానమునకు పోయినవానికి ఏ పేరూ లేకుండా పోవుచున్నది. అందువలన "అన్నీ ఉన్నా ఐదవతనము లేదు" అని మన జ్ఞానులు సామెతను చెప్పారు. ఐదవ తనము స్త్రీకి భర్తయైనట్లు, మనిషికి మోక్షమగుచున్నది. నాలుగు స్థానము లకు పేర్లున్నాయి, అందులోనున్నవానికి ఆ స్థానముల పేర్లు వస్తున్నవి.

అయితే ఐదవ స్థానము దైవము అగుట వలన దానికి పేరులేదు. ఆ స్థానమును పొందినవానికీ పేరులేదు. అందువలన ఆ విషయమును తెలుపు నిమిత్తము, పెద్దలు దానికి సరియైన అర్థమునిచ్చు నిమిత్తము "అన్నీ ఉన్నాయిగానీ, ఐదవ తనములేదు" అన్నారు.

## 11. అమ్మ మంచిదేగానీ, తెడ్డు మంచిది కాదు

దేవుడు విశ్వమును సృష్టించినపుడే మొదట ప్రకృతిని సృష్టించాడు. తర్వాత మూడు ఆత్మలతో కూడుకొన్న జగతిని సృష్టించాడు. జన్మించు దానికి గుర్తుగా **"జ"** అనియు, గతించు (మరణించు) దానికి గుర్తుగా **"గతి"** అనియూ చెప్పుచూ, జనన మరణములను గల జీవరాసులను **"జగతి"** అని అనడము జరిగినది. మొదట సృష్టింపబడిన ప్రకృతినుండి గుణములతో కూడుకొన్న మాయను దేవుడు తయారు చేశాడు. ఈ విషయమును భగవద్గీతలో క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగమున 20వ శ్లోకమందు చెప్పారు.

శ్లో॥ 20. ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సమ్భవాన్ ॥

**భావము :–** పురుషుడైన దేవుడు, స్త్రీ స్వరూపమైన ప్రకృతి, రెండిటి యొక్క పుట్టుక ఎప్పుడు జరిగినదో ఎవరికీ తెలియదు. వికారములను కల్గించు మాయరూపములోనున్న గుణములు, ప్రకృతినుండి పుట్టినవని చెప్పు చున్నాను. పై శ్లోకములో చెప్పిన సమాచారమునుబట్టి దేవుడు సృష్టిని తయారు చేసినపుడే, ప్రకృతిని పుట్టించాడని తెలియుచున్నది. ప్రకృతి పుట్టిన తర్వాత, ప్రకృతినుండి గుణములు పుట్టినవని కూడా తెలియుచున్నవి.

ప్రకృతి నుండి గుణములు పుట్టకముందే, ప్రకృతిని తల్లిగా చేసి, తాను తండ్రిగాయుండి, సర్వజీవరాసులను దేవుడు సృష్ఠించాడు. జీవరాసులను సృష్ఠించకముందే, ప్రకృతిని తయారుచేయగానే ప్రకృతిలోని సూర్యునికి తన జ్ఞానమును తెలిపాడు. బాగా అర్థమయ్యేటట్లు చెప్పితే దేవుడు ఎల్లప్పుడూ ఉండేవాడే, పుట్టువాడు కాడు. ఎప్పటికీ సర్వదాయున్నవాడు ప్రకృతిని తయారు చేసినప్పుడు సృష్ఠి తయారైనదని చెప్పుచున్నాము. సృష్ఠి ఆదిలో మొదట, పరమాత్మనుండి ప్రకృతి తయారుకాగా తర్వాత, జీవరాసులు సృష్ఠించబడినాయి. జీవులు తయారైన తర్వాత ప్రకృతినుండి గుణములు పుట్టాయి. అప్పుడు దేవునినుండి జ్ఞానము కూడా పుట్టినది.

పరమాత్మ సర్వజీవరాసులకు తండ్రికాగా, ప్రకృతి తల్లిగా ఉన్నది. ప్రకృతి నుండి ప్రకృతికి మారురూపుగా వచ్చియున్న మాయను మారు తల్లిగా లెక్కించవచ్చును. దేవుని నుండి పుట్టిన జ్ఞానమును అమ్మ తమ్ముడుగా, మేనమామగా గుర్తించవచ్చును. ప్రకృతి తల్లికాగా, ప్రకృతికి మారు రూపమైన మాయను కూడా మరో తల్లిగా భావించి, మాయ మాత అని అంటున్నాము. పరమాత్మయను తండ్రి, తన సంతానమును గురించి ఏమాత్రము పట్టించుకోడు. సంతానము యొక్క అవసరములన్నిటినీ, పోషణయంతటినీ తల్లియైన ప్రకృతియే చూచుకొనుచుండును. ప్రకృతి జీవరాసులను ప్రేమతో పెంచునది, కోపముతో దండిచునదిగా ఉండును. కోపముతో దండించునపుడు దండమును (కట్టెను) తీసుకొని దండించును కదా! గుణమయమైన మాయయే, ప్రకృతి చేతిలోని దండముగా ఉన్నదని తెలియవలెను. జీవులకు ప్రకృతి ప్రేమగల తల్లిగాయున్నా, జీవులను దండించునపుడు కట్టెగా (దండముగా) యున్నదని చెప్పవచ్చును. దండమును లేక కట్టెను తెడ్డు అని కూడా అనవచ్చును. అమ్మ మంచిదే

అయినా, అమ్మ దండించునపుడు కట్టెవలన నొప్పి, బాధ కల్గుచున్నది. కావున "అమ్మ మంచిదేగానీ తెడ్డు మంచిది కాదు" అను సామెతను పెద్దలు చెప్పారు. ఈ సామెతను తెలియుటకు, ప్రకృతి పరమాత్మలనుండి, సృష్టి పరంపరల వరకు తెలియవలసియుండును. ప్రకృతి మనిషిపట్ల రెండు రకములుగా ఉన్నదని, మహా బలము కల్గిన మాయ కూడా ప్రకృతికి మారు పేరైన గుణములని, అవియే మానవున్ని కఠినముగా శిక్షించు దండముగా ఉన్నవని తెలిసినపుడు, ఈ సామెత యొక్క గూఢార్థము తెలియును.

## 12. ఎగదీస్తే బ్రహ్మహత్య, దిగదీస్తే హత్య, సాగదీస్తే సంబంధమే లేదు

ఎక్కడైనా ఒక హత్య జరిగితే హత్య చేసినవాడు తాను హత్య చేశానని కొందరికి చెప్పుకోవడము జరుగుచున్నది. అలా చెప్పుకోవడము నకు కారణమేమనగా! తాను హంతకుడని ఇతరులకు తెలియుట వలన వారు తనను చూచి భయపడుదురనీ, అలా భయపడుట వలన, ఇతరుల వలన తనకు ఏ ఇబ్బందీ లేకుండా ఉండడమేకాక, తాను చెప్పినమాటకు ఎవరూ ఎదురాడరనీ, దానివలన ఇతరుల మీద తన పెత్తనమును చలాయించవచ్చుననీ అనుకొని, తాను హంతకుడనని చెప్పుకొనుచుందురు. చెప్పడములో కొందరు జరిగినది జరిగినట్లు చెప్పగా, కొందరు జరిగిన దానికంటే ఇంకా ఎక్కువగా చెప్పుచుందురు. హత్య జరిగినది వాస్తవమే అయినా, అక్కడ జరిగిన సంఘటనను ఎక్కువగా వర్ణించి చెప్పువారు చాలామంది కలరు. అలా చెప్పుట వలన తమ గౌరవము, పలుకుబడి పెరుగునని అనుకోవడము జరుగుచున్నది. జరిగినది సాధారణ హత్య అయినా పెద్దగా వర్ణించి చెప్పడము వలన పెద్ద హత్యగా లెక్కించ

బడుచున్నది. హంతకుని శరీరములోని అహము, జరిగిన కార్యమును ఎంత పెద్దగా వర్ణించితే అంత పెద్ద కర్మ సంభవించుచున్నది. కావున పెద్దగా వర్ణించి చెప్పిన హత్య, పెద్ద హత్యగా (బ్రహ్మహత్యగా) లెక్కించబడుచున్నది. అందువలన సామెతలో ఎగదీస్తే బ్రహ్మహత్య అన్నారు. జరిగిన దానికంటే తక్కువగా చేసి చెప్పితే, దానివలన తక్కువ హత్యగా లెక్కించబడి, తక్కువ పాపము వస్తుంది. అందు వలన దిగదీస్తే హత్య అని అన్నారు. ఒకే హత్యను ఎగదీసి చెప్పడము, దిగదీసి చెప్పడము వలన, వాని అహంభావమును బట్టి ఎక్కువ తక్కువ పాపము వస్తున్నదని తెలియుచున్నది.

ఈ విధముగా తాను చేసిన హత్యను మనిషి రెండు రకములుగా చెప్పుకోవడము తెలిసినది కదా! ఒకవేళ హత్య చేసినవాడు సాధారణ వ్యక్తి కాకుండా, దైవజ్ఞానమును తెలిసిన వ్యక్తియైవుండిన, వాడు తాను చేసిన హత్యను గురించి, ఇతరులకు ఎగదీసి చెప్పడు మరియు దిగదీసి చెప్పడు. తనంతకు తాను ఆ కార్యమును గురించి వివరించుకొని చూచును. తనకు తెలిసిన జ్ఞానము ప్రకారము, జీవుడు శరీరములో తలయందు ఒకచోట ఏమీ చేయక ఉండును. జీవుడు స్వయముగా చూడలేడు, స్వయముగా వినలేడు, అలాగే స్వయముగా ఏ పనీ చేయలేక, తనకు లభించినదానిని మాత్రము అనుభవించుచుండును. ఇదివద్దు, ఇది కావాలనుట కూడా జీవునికి చెల్లదు. ఏ అనుభవము తన వరకు వస్తే, దానిని అనుభవించడము మాత్రము జీవుని పనిగా ఉన్నది. గుర్రము గ్రుడ్డిది, కుంటిది అయినప్పుడు అది ఎక్కడికీ పోలేదు, ఏమీ చేయలేదు. కనుక దానికి మెత్తని గుగ్గిళ్ళు పెట్టినా, గట్టి నూకలు పెట్టినా, పచ్చిగడ్డి వేసినా, ఎండుగడ్డి వేసినా సమయానికి ఏది దొరికితే దానిని తిన్నట్లు, జీవుడు కూడా తన వరకు ఏ అనుభవము వస్తే, దానిని అనుభవించవల

సిందే. కష్టమైనా, సుఖమైనా, దుఃఖమైనా, సంతోషమైనా తప్పక అనుభవించ వలసిందే.

జీవుడు తాను శరీరములో ఎక్కడికీ పోలేక, ఏమీ చేయలేక ఎవరి సహాయముతోనో జీవించుచూ, ఏది దొరికితే దానిని మాత్రము స్వీకరించు వాడుగా ఉన్నప్పుడు, ఎక్కడో శరీరము బయట జరిగిన కార్యమునకు తాను ఎట్లు బాధ్యుడగును. శరీరము బయట జరిగిన హత్యాకార్యమును ఎవరో చేసితే ఆ కార్యమునకు, జీవునికి ఏమాత్రము సంబంధములేదు కదా! శరీరములో అవిటివాడుగా (వికలాంగుడుగా) ఉన్న జీవాత్మకు, శరీరము లోపల జరుగు ఏ కార్యముతోగానీ, శరీరము బయట జరుగు ఎటువంటి కార్యముతోగానీ ఏమాత్రము సంబంధములేదు. అటువంటపుడు శరీరము బయట జరిగిన హత్య యొక్క పాపము, జీవునికి అంటదు. అంతేకాక శరీరములోని జీవుడు ఏమాత్రము హంతకుడు కాడు. బయట జరిగిన హత్యలో జీవుడు పాల్గొనుటకు అవకాశమే లేదు. ఏ పనీ చేతగాని వికలాంగుడైన జీవుడు, శరీరములోపలే అన్ని పనులకూ అయోగ్యుడుగా ఉన్నప్పుడు, బయట పనికి ఎట్లు యోగ్యుడగును. దీనినిబట్టి జరిగిన హత్యలో జీవుని ప్రమేయములేదు, జీవుడు హంతకుడు కాడు అనుట సత్యము కాగా, లోకమంతా జీవుడు హంతకుడని అనుకొనుచున్నది. అంతేకాక స్వయముగా జీవుడే తాను హత్య చేశానని, హంతకుడనని చెప్పు కొంటున్నాడు. జీవుడు ఏమీ చేయలేని స్థితిలోవుండి, తాను చేయని పనిని చేశానని ఎందుకు చెప్పుకొంటున్నాడు? అని ప్రశ్నించుకొని చూస్తే ఇలా తెలియుచున్నది.

మీకు అర్థమగుటకు ఒక చిన్న ఉదాహరణను చూస్తాము. మూర్తి అనునతడు, మధ్యాహ్నము భోజనము చేసి, విశ్రాంతి కొరకు పడుకొని

నిద్రలోనికి జారుకొన్నాడు. అప్పుడు స్వప్నము వచ్చినది. ఆ స్వప్నములో అతడు రైలులో ప్రయాణము చేయుచున్నాడు. తర్వాత స్టేషన్‌లో తన సూట్‌కేస్ తీసుకొని దిగాడు. తాను రాముని భక్తుడైనందున తన సూట్‌కేస్ మీద శ్రీరామ అను పేరును పెద్దగా వ్రాసుకొన్నాడు. స్వప్నములో జరుగు సంఘటనలు వేగముగా జరగడమేకాక, స్పష్టముగా ఉండవు. మరియు వివేకముగా ఉండవు. రైల్వేస్టేషన్‌లో దిగినవాడు, తన ఇంటి ప్రక్క బజారులో పోవుచుండగా తన సూట్‌కేస్‌ను ఎవరో లాగుకొని పోయారు. అలా తన సూట్‌కేస్‌ను దొంగ లాగుకొని పోగానే, తన సూట్‌కేస్ పోయిందను భయముతో వెంటనే నిద్రనుండి లేవడము జరిగినది. నిద్రనుండి లేస్తూనే స్వప్నములో జరిగిన సంఘటనకు, తన సూట్‌కేస్ పోయినందుకు కొంత భయపడడము జరిగినది. ఆ భయము, మేల్కొన్న తర్వాత కూడా కొంత అతనికి ఉండడము జరిగినది. అలా లేచిన వానికి, అది అంతయు స్వప్నమని తెలిసి భయమునుండి తేరుకొని సాధారణముగా అయిపోయాడు. తర్వాత వెంటనే మూర్తి ఇల్లు వదలి బజారుకు పోవడము జరిగినది. అక్కడ గుంపుగా జనముండగా అక్కడికి పోయి చూచాడు. అక్కడ పోలీస్ వారు ఒక దొంగను పట్టుకొని, వానినుండి ఒక సూట్‌కేస్ లాగుకొని "ఇది ఎవరిది ఎక్కడ దొంగిలించావు?" అని వానిని ప్రశ్నించుచుండిరి. అక్కడికి పోయిన మూర్తికి, స్వప్నములో జరిగిన దృశ్యము జ్ఞప్తికి వచ్చినది. అక్కడ దొంగ దగ్గర దొరికిన సూట్‌కేస్, తన సూట్‌కేస్‌లాగే ఉండడము చూచి వెంటనే ఇది నాదేనని మూర్తి అనడము జరిగినది. అప్పుడు పోలీస్‌వారు నీ సూట్‌కేస్‌కు ఏదైనా గుర్తు చెప్పగలవా అని అడిగారు. అప్పుడు అతను తన సూట్‌కేస్ మీద శ్రీరామ అని వ్రాసివుందని చెప్పగా, సూట్‌కేస్ క్రింది వైపున అతను చెప్పినట్లు ఉండడముచూచి, ఆ సూట్‌కేస్‌ను మూర్తికి

ఇవ్వడము జరిగినది. అప్పుడు మూర్తి, కలలో జరిగింది నిజమైనదని అనుకొన్నాడు. మూర్తికి సూట్‌కేస్‌ను ఇచ్చిన పోలీస్‌వారు, సూట్‌కేస్‌లో ఏముందని అడిగారు. అందులో ఏమున్నది తెలియదు కావున, అప్పుడు మూర్తి వారి మాటకు సమాధానము చెప్పలేకపోయాడు.

అంతలో అక్కడికి పోలీస్ అధికారి వచ్చి, విషయమంతా తెలుసుకొని సూట్‌కేస్ నీదైనా, దానిలో ఏమున్నదో తనఖీ చేయాలని చెప్పి దానిని తెరిపించాడు. అప్పుడు ఆ సూట్‌కేస్‌లో ఒకకేజి గంజాయి పొట్లాలు దొరికాయి. అప్పుడు పోలీస్ అధికారి, మూర్తి మీద కేస్ వ్రాయడము జరిగినది. అతనిని అరెస్టు చేయడమూ జరిగినది. వాస్తవానికి ఆ సూట్ కేస్ మూర్తిది కాదు. అయినా స్వప్నములో అది తనదే అయినందున మూర్తి, నాది అని చెప్పడము జరిగినది. ఒక్క ప్రక్క మూర్తి తన వాదన సరియైనదే అనుకొనినా, స్వప్నములో అది వాస్తవమేగానీ, మెలకువలో అది వాస్తవము కాదని గ్రహించలేకపోయాడు. స్వప్నములో మూర్తి ఉన్నది వాస్తవమే, మెలుకువలో కూడా మూర్తి వాస్తవమే. అయితే స్వప్నములో జరిగినది, మెలకువకు సంబంధము లేదని, జరగనట్లేనని గ్రహించలేక పోయాడు. అందువలన చేయని నేరానికి అతడు బాధ్యుడైనాడు. ఇప్పుడు అసలు విషయానికి వచ్చి ఉదాహరణను పోల్చుకొని చూస్తాము. స్వప్నములో జరిగినదంతయు మూర్తికి తెలిసినట్లు, మెలకువలో జరిగినది కూడా జీవునకు తెలియుచున్నది. స్వప్నములో జరిగినవన్నియు అసత్యమే అయినా జీవుని అనుభవమునకు మాత్రము సత్యము. అలాగే మెలకువలో జరిగిన హత్య జీవునకు సంబంధములేకున్నా, తన ముందరే జరిగినట్లు బుద్ధి తెలుపడము వలన, బుద్ధి చూపిన సంఘటనను నీవే చేశావని అహము చెప్పడము వలన, అహము అందించిన భావమును పొందిన జీవుడు తన

స్థితిని తాను మరచిపోయి, అహంభావమును పొంది, జరగని హత్యను నేనే చేశానని చెప్పుకోవడము జరిగినది. దొరికిన సూట్‌కేస్ తనదేనని మూర్తి చెప్పినట్లు, జరిగిన పని తనదేనని జీవుడు చెప్పుచున్నాడు. స్వప్నమును వివరించుకొని లేక సాగదీసుకొని చూస్తే, "స్వ" అనగా తనకు మాత్రమేనని, "అప్నము" అనగా అనుభవము అని తెలియుచున్నది. స్వ+ అప్నము=స్వప్నము అనగా, జీవునికి మాత్రమే అనుభవమునకు వచ్చునది అని తెలియుచున్నది. జీవునికి ఒక అనుభవము రావలెనంటే దానికి ఎంతో కృషి జరుగవలసియుంటుంది. ఎంతోమందితో సంబంధము గల పని జరుగవలసియున్నది. బయట ప్రపంచములో ఏ కార్యమైనా జరుగుటకు అవకాశము గలదు. అందువలన అది అందరికీ తెలియునదిగా ఉండడమేకాక, కొందరితో సంబంధపడియుండును. అయితే స్వప్నములో దీనికి పూర్తి విరుద్ధముగా ఎవరికీ సంబంధము లేకుండా, ఎవరికీ తెలియకుండా కార్యము జరిగి, జీవునకు ఒక్కనికి మాత్రమే అనుభవము వచ్చుననుట వింతగా ఉండినా చివరికది సత్యము. స్వప్నములోని సంఘటనలు ఒకవైపు, అసత్యముగా కనిపించినా, ఒకవైపు అనుభవించిన జీవునికి సత్యముగా కనిపించుచుండును.

వివరముగా అర్థమగుటకు, స్వప్నములోని సత్యాసత్యములను గూర్చి ఎటు చెప్పినా మరొక ప్రశ్నరాక తప్పదు. స్వప్నములో జరిగినది సత్యము అంటే సత్యమెట్లగునని ప్రశ్నవచ్చును. ఒకవేళ అసత్యమని చెప్పితే అసత్య మెట్లగునను ప్రశ్నవచ్చును. రెండువైపులా ప్రశ్నలున్న ఒక స్వప్నమును గురించి చెప్పెదను చూడండి. ఒక వ్యక్తికి స్వప్నములో ఒక స్త్రీతో సంగమించిన సంఘటన జరిగినదనుకొనుము. అపుడు అతని శరీరము నుండి వీర్య ద్రవము స్రవించి, గుడ్డలమీద పడియుండుట ప్రత్యక్షముగా

కనిపించుచుండును. మెలుకువలోనికి వచ్చిన తర్వాత, ఆ వ్యక్తి అదంతయు కల అనుకొనినా, జరిగినపని వాస్తవమేననుటకు సాక్ష్యముగా వీర్య స్కలితము కనిపించుచున్నది. దానినిబట్టి ఒక స్త్రీతో అతను రమించాడనుట సత్యమనినా, అతనితోనున్న స్త్రీ, అతని దగ్గరకు రావడము అసత్యము. ఆమెకు ఈ సంఘటనకు ఏ సంబంధము లేదు. కావున స్వప్నములో జరిగినది సత్యముకాదు, దానిని సత్యమని ఎలా చెప్పుదురని ప్రశ్న రాగలదు. ఒకవేళ ఎవరికీ సంబంధము లేనిది, ఎవరికీ తెలియనిది, అతడు మాత్రము చెప్పునది సత్యము కాదని అనుకొనినా, ఈ పని జరిగినదని, సాక్ష్యముగా బయటపడిన వీర్యము కనిపిస్తుండడము వలన, ఇదెలా అసత్యము అని ప్రశ్న రాగలదు. ఇటు రెండువైపులా ప్రశ్నలకు జవాబు కావాలంటే, స్వప్నములో కనిపించిన స్త్రీ మరియు మిగతా పాత్రలన్నీ, ఎవరో తెలియని వ్యక్తి పోషించియుండాలి. అక్కడ స్త్రీ పాత్రను పోషించినది, ఎవరో తెలియని వ్యక్తి. అందువలన ఆ సంఘటన బయట వారికి ఏమాత్రము సంబంధము లేదు. అది జరిగినట్లు ఎవరికీ తెలియదు. స్వప్నము పొందిన వానికి మాత్రము జరిగిన సంఘటన తెలియును. స్వప్నములో అన్ని పాత్రలు పోషించినది, ఎవరికీ తెలియని ఆత్మయేనని, అనుభవించిన వానికి కూడా తెలియదు.

స్వప్నములో జరిగిన కార్యములో కూడా, జీవుడు సుఖమునో దుఃఖమునో అనుభవించుచున్నాడు. సుఖదుఃఖములను అనుభవించడమే కాక, నేనే ఆ కార్యమును చేశానని అనుకొంటున్నాడు. స్వప్నములో కార్యమునంతటినీ జరిపించునది ఆత్మయే అయినా, ఆ విషయము తెలియని మనిషికి, శరీరములోని అహము అనునది, "ఈ కార్యమునంతటినీ నీవే చేశావు, ఎవరో చేశారని అనుకోవద్దు. నీవు తప్ప చేసేవాడు ఎవడూ

లేదని" బోధించడము వలన, జీవుడు అహము యొక్క భావమును విని, తాను అహంభావముతో చేరిపోయి, శరీరమునే నేనను భావముతో నిండిపోయి, జరిగిన పనిని నేనే చేశానని అనుకొంటున్నాడు. శరీరములో ఒక్క రవ్వంతయుండిన జీవుడు, శరీరమంతా నేనేనని అనుకోవడముతో పూర్తిగా తన స్థితిని మరచిపోయాడని తెలియుచున్నది. ఇదే విధానము ప్రకారము, స్వప్నములో జరిగిన పనిలోగానీ, మెలుకువలో జరిగిన పనిలోగానీ కనిపించుచున్నది. మెలుకువలో హత్య జరిగినపుడు, హత్య చేసినవాడు ఎవరికీ తెలియకుండా శరీరమంతా వ్యాపించియుండిన ఆత్మ, శరీరమును కదిలించి ఎదుటి వ్యక్తిని హత్య చేయడము జరిగినది. అయితే హత్య జరిగిన ఆ విషయమును ప్రత్యక్ష ప్రసారముగా లోపలయున్న జీవునికి బుద్ధి తెలుపగా, అహము బోధవిన్న జీవుడు, ఎదురుగా కనిపిస్తూ జరుగుచున్న పనిని, తానే చేయుచున్నానని అనుకోవడము జరుగుచున్నది. అలా అనుకోవడము వాస్తవముగా హత్య చేసిన ఆత్మను మరచిపోయి, జీవుడు తానే హంతకునిగా తెలియబడుచున్నాడు. జీవితములో ప్రతి పనిని ఆత్మే చేయుచున్నా, నేడు మనుషులందరూ ఆత్మపాత్రను గుర్తించక, అన్ని పనులను తామే చేయుచున్నామనుకొంటున్నారు. ఆత్మచేత జరిగిన పనిని, జీవుడు నేనే చేశానని ఎంత పెద్దగా చెప్పుకొంటే, అంత పెద్ద కర్మ అతనిని చేరుచున్నది. ఒక హత్యను చేశానని ఎగదీసి ఎక్కువగా చెప్పుకొంటే, అది పెద్ద హత్యగా లెక్కించబడి పెద్ద పాపమే వస్తున్నది. ఒకవేళ జరిగిన హత్యను దిగదీసి తక్కువగా చెప్పుకొంటే, చిన్న హత్యగా లెక్కించబడి తక్కువ పాపము వస్తున్నది.

భూమిమీద ఎవడైనా ఆత్మజ్ఞానమును తెలిసినవాడై, శరీరములో ఆత్మ పాత్రను గుర్తించి, జీవుడుగా తన స్థానమేదో తెలిసి, తన స్థితిని

గుర్తించి, అన్నియు ఆత్మ వలననే జరుగుచున్నవనీ, తాను ఏ పనికీ కారణము గానీ, కర్తనుగానీ కానని తెలిసి, అహము భావమునకు దూరముగా ఉండువాడు, వాస్తవముగా ఆ పనిని చేయలేదు కనుక, వానిని హంతకుడు అనుటకు వీలులేదు. హత్యాపాపము వానికి రాదు. జరిగిన హత్యను సాగదీసి వివరించి చూచితే, ఒక మనిషిలోని ఆత్మ ఆ పనిని చేసిందిగానీ, జీవుడు చేయలేదని తెలియుచున్నది. అందువలన పై సామెతలో సాగదీసి చూస్తే సంబంధమే లేదని చెప్పారు. ఇదే విషయమును భగవద్గీతలో మోక్ష సన్న్యాస యోగమందు, 16,17వ శ్లోకములలో భగవంతుడు చెప్పాడు.

16. శ్లో॥ తత్రైవం సతి కర్తారం ఆత్మానం కేవలం తు యః ।
పశ్య త్యకృతబుద్ధిత్వాత్ న స పశ్యతి దుర్మతి ః ॥

17. శ్లో॥ యస్య నాహంకృతోభావో బుద్ధిర్యస్య న లిప్యతే ।
హత్వాపి స ఇమాన్ లోకాన్న హన్తి ననిబధ్యతే ॥

**భావము :–** "జరుగుచున్న పనులకు కర్తను తానేనని ఎవడు అనుకొనునో, వాడు అన్ని పనులకు, కర్త మరియొకడున్నాడను వాస్తవమును తెలియక అజ్ఞానియై తననే కర్తగా చెప్పుకొనును."

"ఎవని భావములో అహము యొక్క భావముండదో, జరుగుచున్న పనిలోని ఫలితమును ఎవడు ఆశించడో, వాడు ఈ లోకములోని వారందరిని చంపినప్పటికీ హంతకుడు కాడు, మరియు వానికి పాపము అంటదు." చూచారా! దేవుడు ఏ విధముగా చెప్పాడో! మనిషి చేయుచున్న పనిని తానే చేయుచున్నానని ఆ జీవుడు అనుకోవడము అజ్ఞానమగును. దానివలన వాడు ఎంతగా అనుకొంటే అంతగా పాపము వచ్చును. అట్లుకాకుండా మనిషి చేయుచున్న పనికి, ఆ శరీరములోని ఆత్మయేకర్త అని తెలిసిన

జీవునికి కర్మ అంటదు. వాడు హత్య చేసినా, వానికి పాపమురాదు, మొత్తానికి వాడు హంతకుడే కాడు. ఇంతటి జ్ఞానమును తెలియజేస్తూ, "ఎగదీస్తే బ్రహ్మహత్య, దిగదీస్తే హత్య, సాగదీస్తే సంబంధమే లేదు" అని సామెతగా మన పెద్దలు చెప్పారు.

## 13. ఇంట గెలిచి రచ్చ గెలుచు

ఇల్లు అనగా నివసించుటకు యోగ్యముగా ఉండునది. పక్షులకు నివాసయోగ్యమైన గూళ్ళు, వాటికి ఇల్లులాంటివి. చీమలకు పుట్టలు, మనుషులకు చిన్న పాకలు మొదలుకొని, పెద్ద మేడల వరకు ఇల్లుగా ఉన్నవి. పక్షులకు ఒక రకము, చీమలకు మరొక రకము, మనుషులకు ఇంకొక రకముగానున్న ఇళ్ళన్నియు మనము చూచియే ఉన్నాము. మనిషి నివసించునది ఇల్లు. నివసించునది ఎవరికైనా రెండు రకములుగా కలవు. ఒక మనిషి నివసించునది ఒక రకము ఇల్లుకాగా, రెండవ రకమును గృహము అంటాము. ఇప్పుడు కొందరు ఒక ప్రశ్న అడుగవచ్చును. ఇల్లు అనినా గృహము అనినా రెండూ ఒకటే కదా! ఇల్లును, గృహమును వేరువేరని చెప్పడమేమిటి? అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఇలా కలదు. ఒక కట్టడమును ఇల్లు అనవచ్చును. కొంత విస్తీర్ణమైన ఇంటిలో ఒకరు లేక అంతకంటే ఎక్కువ మనుషులు నివసించవచ్చును. అయితే గృహములో 26 మంది వరకు ఉండగలరు. గృహము అనగా గ్రహము నివసించునది అని అర్థము. గ్రహించువానిని గ్రహము అంటాము. జీవుడు బుద్ధి ద్వారా అన్నింటినీ గ్రహించుచున్నాడు. కావున జీవున్ని గ్రహము అని అనవచ్చును. ఇంటిలోనున్నవానికి, ఇల్లు దాటి బయటనున్నదంతా రచ్చయగును. రచ్చ బండ అనుమాటను వినియేవుందుము. కొందరు కలిసి మాట్లాడుకొనుటకు

అవకాశమున్న స్థలమును రచ్చ అంటాము. జీవుడు నివసించు శరీరమును గృహము అని అనవచ్చును కదా? శరీరము (గృహము) దాటి, బయట ఎక్కడైనా రచ్చయగును. నివసించునది ఇల్లు కావున గృహమును కూడా ఇల్లు అనవచ్చును. మనిషి, వానితో పాటు కొందరు ఉండునది ఇల్లుకాగా, జీవుడు, జీవునితో పాటు అలాంటి వారే కొందరుండు దానిని గృహము అంటాము. ప్రత్యేకించి జీవుడు నివసించు దానిని గృహము అనడములో, జీవుడు పాపపుణ్యములను గ్రహించి, వాటి ఫలితములను కూడా గ్రహించగలుగుచున్నాడు. అంతేకాక బయటనుండి తెలియబడు విషయము లను బుద్ధి గ్రహించి, జీవునికి తెలుపగా, జీవుడు వాటిని గ్రహించ గలుగుచున్నాడు. ఈ విధముగా జీవుడు గ్రహించువాడు కావున, జీవుడు నివసించు శరీరమును 'గృహము' అని అంటున్నాము.

శరీర గృహములో జీవునితోపాటు 26 మంది నివసిస్తున్నారు. మంది అనగా మనుషులని అనుకోకూడదు. మంది అనగా గుంపు అని అర్థము చేసుకోండి. ఒక విధముగా చెప్పవలెనంటే, శరీరములో 26 భాగములున్నవని చెప్పవచ్చును. ప్రత్యేకమైనపని చేయు దానిని ప్రత్యేక భాగముగా చెప్పితే, అటువంటివి 24 కలవు. తర్వాత 25వ వాడు జీవాత్మ, 26వ వాడు ఆత్మ. 26వ ఆత్మ మొత్తము శరీరమునకంతటికీ పెద్ద. అయినా ఆయన ఎవరికీ తెలియకుండా ఉన్నాడు. 25వ వాడు అయిన జీవాత్మయే మనము (నీవు). జీవాత్మయిన నీవు, నీ శరీరములోని మిగతా 25 భాగములు ఏమి కార్యములు చేయుచున్నవో, తెలియగలిగితే జ్ఞానివి కాగలవు. నీవు జ్ఞానివైన తర్వాత, నీ శరీరము బయటనుండి వచ్చు సమస్యలను సులభముగా జయించగలవు. ఏ సమస్యకైనా పరిష్కారమును తెలియగలవు. నీ ఇంటిలోని మనుషులు నీతోపాటు ఎందరున్నది, వారు

ఏమి చేయునది చెప్పగలుగు నీవు, నీ శరీర గృహములో నీవలె ఎందరున్నది, వారందరూ ఏమి చేయుచున్నది చెప్పలేవు. నీవేకాదు, మాకు జ్ఞానము తెలుసు, మేము బోధించువారము అని చెప్పుకొనువారు కూడా, శరీర గృహమును గురించి పూర్తిగా తెలియరు. అటువంటివారిని గురించి ఒక జ్ఞాని తన పద్యములో ఈ విధముగా చెప్పాడు చూడండి.

**పద్యము :** ***పంచతత్త్వములను పంచీకరించక***
***మంచి యతులమన్న మాటలన్న***
***కుంచమందు గజము గుడ్డు పెట్టిన విధంబు***
***అఖిల జీవసంగ ఆత్మలింగ.***

**భావము :–** ప్రకృతి అయిన పంచభూతములనుండి తయారైనది శరీరము. పంచభూతములను పంచీకరించితే మొత్తము 25 భూతములగును. 25 భాగములతోనున్న శరీరమును గురించి పూర్తిగా తెలియకుండా, ఏ భాగము ఏ పనిని చేయుచున్నదో తెలియకుండా, నేను జ్ఞానిని అంటే, ఏనుగు గంప క్రింద గుడ్డు పెట్టినట్లుంటుంది. ఏనుగు గంపక్రింద గుడ్డు పెట్టడము ఎంత సత్యమో, శరీర అంతరంగములోని కార్యములను తెలియనివానిని, జ్ఞాని అని చెప్పడము అంతే సత్యమగును. ఏనుగు గంపక్రింద గుడ్డు పెట్టడము పూర్తి అసత్యము కావున, అంతరంగములోని భాగముల కార్యములు తెలియనివానిని, జ్ఞాని అనడము కూడా పూర్తి అసత్యము. గ్రహముగా నున్న జీవుడు తన శరీర గృహములో గల 24 భాగముల పనిని తెలిసినరోజు, బయట నుండి వచ్చు విషయములను సులభముగా జయించగలుగును. లోపల తన సహచరులను గురించి తెలియనివాడు, బయటనుండి వచ్చు సమస్యలను పరిష్కరించుకోలేడు. వాటిని జయించలేక కృంగిపోవును. అందువలన జ్ఞానదృష్టితో పెద్దలు, ఇంట గెలువలేనివాడు

రచ్చ గెలువలేడను ఉద్దేశ్యముతో "ఇంట గెలిచి రచ్చ గెలుచు" అన్నారు. బయటి ఇంటిలో గెలిచితే, బజారులో గెలువవచ్చునని బయటి అర్థముతో ఈ సామెతను చెప్పుకోకూడదు. సామెతను ఎప్పటికైనా జ్ఞానదృష్ఠితోనే చూడవలెను. చెప్పిన సామెత బాహ్యార్థమునిచ్చునదిగా కనిపించుచుండినా, అది అంతరార్థము కలిగియుండును. అందువలన ఇంట గెలిచి అని ఉన్న మాటను, శరీరములోని ప్రతి భాగముయొక్క వివరము తెలిసివుండవలెనని, చెప్పడముగా తెలియవలెను. నీవు నివసించు శరీరములోనే ఆత్మ, పరమాత్మ యున్నది. కావున నీవు ఆత్మజ్ఞానమును శరీరమునుండియే మొదలు పెట్టి, శరీరములోనే వెదకవలసివుండును. చివరకు, మోక్షము పొందు సమయములో కూడా శరీరములోని పరమాత్మయందే కలియవలసి వున్నది. కావున ఎవడైనాగానీ శరీరమును గురించి పూర్తిగా తెలిసిన తర్వాతే ఆత్మ జ్ఞాని కాగలడు.

## 14. అమ్మకాని అమ్మ, నీకుంది, నాకుంది

అమ్మ అంటే తెలియనివాడు భూమి మీద ఎవరూ ఉండరు. ప్రతి ఒక్కరికి అమ్మ ఒక్కతే అయినా, నాన్నలు ఇద్దరుండవచ్చును, ఉండక పోవచ్చును. అమ్మ జీవితములో ఒక భర్త చనిపోయిన తర్వాత రెండవ భర్తను వివాహమాడినపుడు, అతను కూడా అమ్మకు భర్త అయినందున ఆయన కూడా నాయనే అగును. దీనినిబట్టి నాన్నలు ఎందరైనా, అమ్మ ఒక్కతేనను నానుడి వాక్యము కలదు. ఇదంతా లోకమునకు తెలిసిన సత్యము, అయితే లోకమునకు తెలియని సత్యమొకటి కలదు. అదేమనగా! ప్రతి మనిషికీ ఇద్దరు అమ్మలు, ఇద్దరు నాన్నలు ఉన్నారు. ఇదెలా సాధ్యమగు నని ఆశ్చర్యపోవలసిన అవసరములేదు. తండ్రులు ఇద్దరున్నా, అమ్మ

మాత్రము ఒక్కరే అని ఇంతవరకు తెలిసినా, ఇప్పుడు మాత్రము తల్లులు కూడా ఇద్దరున్నారని చెప్పక తప్పదు. తండ్రులు కూడా, ప్రతి ఒక్కరికీ ఇద్దరున్నారని తెలియుచున్నది. ఒక తల్లి, ఒక తండ్రి శాశ్వితముగా ఉండగా, మరొక జంట తల్లితండ్రులు జీవుని జన్మ జన్మకు మారుచుందురు. దీనినిబట్టి శాశ్విత తల్లితండ్రులనీ, తాత్కాలిక తల్లితండ్రులనీ రెండు రకములుగా ఉన్నట్లు తెలియుచున్నది. తాత్కాలిక తల్లితండ్రులు, ప్రతి జన్మకూ మారుచుందురు. ప్రస్తుత జన్మలో నీకుగానీ, నాకుగానీ తాత్కాలిక తల్లితండ్రులున్నారు. వీరు ఫలానావారని కనిపిస్తున్నారు. అయితే శాశ్విత తల్లితండ్రులున్నారను విషయము చాలామందికి తెలియదు. శాశ్వితమైన తల్లితండ్రులు, ఎవరికీ కనిపించక ఉండుట వలన, వారిని ఎవరూ తెలియకున్నారు.

కనిపించని శాశ్వితమైన తల్లితండ్రులకు నీవుగానీ, నేనుగానీ, మరెవ్వరైనాగానీ ఒక్కమారే జన్మిస్తాము. ఎప్పుడో సృష్టి ఆదిలో ప్రకృతియను తల్లికి, పరమాత్మయను తండ్రికి పుట్టిన మనము, నేటివరకు బ్రతికే యున్నాము. అప్పటినుండి ఇప్పటివరకు ఎన్నోమార్లు భౌతికముగా చనిపోయి, శరీరమును మార్చుకొని పుట్టిన మనము, ఇప్పటివరకు శాశ్వితముగా ఉన్నాము. శరీరమును ధరించిన మనిషిగా కాకుండా, ఆత్మ తోడైయున్న జీవునిగా ఇప్పటివరకు ఉన్నాము. ఇప్పటివరకు శాశ్వితముగా ప్రకృతి తల్లిగా, పరమాత్మ తండ్రిగాయున్నారు. అయితే మనకు దేవుడే తండ్రియనీ, ప్రకృతియే మాతగాయున్నదని ఎవరికీ తెలియకుండా పోయినది. ఎక్కడో ఒక చోట, తన్ను గురించి తాను తెలిసిన జ్ఞాని మాత్రము, తనకు తండ్రి దేవుడనీ, తల్లి మాయయనీ (ప్రకృతియనీ) చెప్పుకొంటున్నాడు. అలా తెలిసిన జ్ఞానులు శాశ్విత తల్లితండ్రులను గూర్చి మనుషులకు

తెలియునట్లు, అనేకరకములుగా అక్కడక్కడ చెప్పారు. యతియైన వేమనయోగి తన పద్యములో ఇలా చెప్పాడు.

**పద్యము :** ***తల్లితండ్రుల మీద దయలేని పుత్రుండు***
***పుట్టనేమి వాడు గిట్టనేమి***
***పుట్టలోన చెదలు పుట్టదా గిట్టదా***
***విశ్వదాభిరామ వినురవేమా!***

ఈ పద్యములో వేమనయోగి, శాశ్వితమైన తల్లితండ్రుల మీద ధ్యాస లేనివాడు, పుట్టలోని చెదలుతో సమానమని చెప్పాడు. పుట్టలోని చెదలు పుట్టినా గిట్టినా, వాటి జీవితము ఉన్నా లేనట్లే కదా! అలాగే ప్రకృతి పరమాత్మలను గురించి తెలియనివాడు, పుట్టినా, పుట్టకపోయినా ఒక్కటేనని, అటువంటివాని జీవితము వ్యర్థము అని చెప్పారు. ఒక మత మూల గ్రంథములో ఇలా చెప్పబడియున్నది. "తండ్రియని ఎవరినీ పేరుపెట్టి పిలువవద్దు, నీ తండ్రి నీకు తెలియని లోకములో, లోకముకాని లోకములో ఉన్నాడు." ఈ విధముగా ఎందరో జ్ఞానులు వేరువేరు విధముల మన శాశ్విత తల్లితండ్రులను గురించి చెప్పారు. అయినా వారు ఏమి చెప్పారో తెలియని స్థితిలో మనుషులుండిపోయి, అసలైన తల్లితండ్రులను గురించి తెలియకపోయారు. ఇందువులకు (హిందువులకు) మూల గ్రంథమైన భగవద్గీతయందు గల, గుణత్రయ విభాగయోగమను అధ్యాయములో, 3,4వ శ్లోకములలో దేవుడైన భగవంతుడే స్వయముగా, మానవులకు మరియు సర్వజీవరాసులకు, శాశ్వితమైన తల్లితండ్రులను గురించి చెప్పడమైనది. ఎవడు ఏ తల్లి గర్భమునుండి పుట్టినా, బీజదాతనైన నేను తండ్రినియనీ, ప్రకృతి తల్లియనీ చెప్పాడు. ఈ విషయమును గురించి తెలిసిన ఒక మనిషి, ఇంకొకనితో "అమ్మగాని అమ్మ, నీకుంది నాకుంది" అని అన్నాడు. ఆ

మాట నేడు సామెతగా ఉన్నా, దానిలోని అర్థము అందరికీ తెలియకుండా పోయినది. ఇప్పుడు ఈ వాక్యమునకు అర్థము తెలిసిందనుకుంటాను.

## 15. నీకూ బెబ్బెబ్బే! నీ అబ్బకూ బెబ్బెబ్బే!

ఒకడు ఇంకొకన్ని వెక్కిరించునపుడుగానీ, హేళనగా మాట్లాడు నప్పుడుగానీ, నీకుగానీ, నీ అబ్బకుగానీ భయపడను అని చెప్పునపుడుగానీ, నీకూ బెబ్బెబ్బే, నీ అబ్బకూ బెబ్బెబ్బే అను మాటను వాడుచుందురు. ఈ మాట కొన్ని ప్రాంతములలో సామెతగా కూడా వాడబడుచున్నది. ప్రపంచ విధానములో, ఎవరు ఏ అర్థముతో చెప్పుకొనినా, మనము మాత్రము పెద్దలు చెప్పిన మాటను, ఆత్మజ్ఞానముతోనే వివరించి చెప్పుకొందాము. సృష్ట్యాదికంటే ముందు, ఏక స్వరూపునిగానున్న దేవుడు, సృష్ట్యాది తర్వాత మూడు విధములుగా విభజింపబడియున్నాడు. మొదట తననుండి ప్రకృతిని విడదీసిన పరమాత్మ (దేవుడు), తాను మూడు భాగములుగా విభజింప బడినాడు. ఒక భాగము జీవాత్మగా, రెండవ భాగము ఆత్మగా, మూడవ భాగము పరమాత్మగా చెప్పబడుచున్నాడు. జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను మూడు భాగములుగా విభజింపబడినవాడు, మూడు సమాన భాగములుగా విభజింపబడలేదు. జీవాత్మ మూడు కొలతలు కల్గియుండగా, ఆత్మ ఆరు కొలతలు కల్గియున్నది, పరమాత్మ తొమ్మిది కొలతలు కల్గియున్నదని చెప్పవచ్చును. ఆత్మను కొలబద్దగా తీసుకొని కొలిచి చూచితే, జీవాత్మ '3', ఆత్మ '6', పరమాత్మ '9' గా ఉండుట వలన, వాటికి సంఖ్యలను కూడా జత చేర్చి, ఆయా ఆత్మలకు, ఆ సంఖ్యలను గుర్తుగా చెప్పుచున్నాము. ఆత్మను గురించి చెప్పవలసిన చోట, ఆరు (6) అంకెను పెట్టి చూపితే

సరిపోతుంది. అలాగే జీవాత్మకు, మూడు (3) సంఖ్యను చూపితే సరిపోతుంది. పరమాత్మ యొక్క ప్రస్తావన వచ్చినపుడు, తొమ్మిది (9) సంఖ్యను వ్రాస్తే సరిపోతుంది.

మూడు ఆత్మలను తెలిసినపుడు, పరమాత్మ, ఆత్మ, జీవాత్మయని చెప్పుటకు 9,6,3 అని చెప్పవచ్చును. ఈ మూడు ఆత్మలు ఒకే పరమాత్మ నుండి వచ్చినవని తెలుసుకొన్నాము కదా! పరమాత్మ విభజింపబడక ముందుగానీ, విభజింపబడిన తర్వాతగానీ ఒకే విలువ కలిగియున్నాడు. మొదట ఎలాగున్నాడో అలాగే ఉంటూ, తనకంటే మూడువంతులు తక్కువ గల ఆత్మను తయారు చేసి, ఆత్మకంటే మూడు వంతులు తక్కువగల జీవాత్మను తయారు చేశాడు. ఆ తేడాలు 9, 6, 3 లో సులభముగా తెలియుచున్నవి. మూడు భాగముల తేడాతో గల మూడు ఆత్మలను గురించి, భగవద్గీతయందు పురుషోత్తమ ప్రాప్తి యోగమున, 16, 17వ శ్లోకములందు భగవంతుడు వివరముగా చెప్పాడు.

16.శ్లో॥ ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోక్షర ఉచ్యతే ॥

17.శ్లో॥ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః ।
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥

**భావము :-** "లోకములోని పురుషులందు క్షరుడు, అక్షరుడు అను రెండు విధముల పురుషులుగలరు. సర్వజీవరాసులు క్షర పురుషులుగా ఉండగా, అక్షర పురుషుడు, క్షరపురుషులైన జీవరాసులతో కూడుకొనియున్నాడు."

"ఉత్తమమైన పురుషుడు, ఇద్దరి పురుషులకంటే వేరుగా ఉన్నాడు. పరమాత్మగాయున్న మూడవపురుషుడు ముల్లోకములు ఆవహించి అన్నిటికీ అధిపతియై, నాశనములేని అవ్యయుడైయున్నాడు". ఇది పై శ్లోకములలోని సమాచారము. ఈ సమాచారము ప్రకారము ప్రతి మనిషియందు మూడు ఆత్మలున్నవని తెలియుచున్నది. ఈ విషయమును తెలిసిన జ్ఞాని ఇంకొకనితో 'నీకు మూడు ఆత్మలున్నాయి, నీ అబ్బకు మూడు ఆత్మలున్నాయని' చెప్పుచూ, నీకూ బెబ్బెబ్బే, నీ అబ్బకూ బెబ్బెబ్బే అన్నాడు. ఇక్కడ బాగా గమనిస్తే, నీకు బెబ్బెబ్బే అన్నప్పుడు మొదట చెప్పినది "బె" మాత్రమే. దానిని జీవాత్మగా పోల్చి చెప్పుకోవచ్చును. రెండవ అక్షరము "బ్బె" అని కలదు. మొదటి అక్షరమునకు రెండవ అక్షరమునకు కొంత తేడా కనిపిస్తున్నది. మొదటిది "బె"కాగా, రెండవది "బె" కింద 'బా' వత్తు వచ్చిన "బ్బె"గా ఉన్నది. రెండవది వత్తు 'బ్బె' అయినది. అందువలన రెండవ అక్షరములో తేడా కల్గియున్న 'బ్బె'ను ఆత్మతో పోల్చి చెప్పడమైనది. ఇక మూడవ అక్షరమును చూస్తే, రెండవ అక్షరముకంటే కొంత తేడాయున్నట్లు తెలియుచున్నది. మూడవది "బ్బే" అనుట వలన మూడవ దానికి దీర్ఘము కూడా వచ్చినది. అందువలన ముందు కల బె, బ్బె, కంటే బ్బే పెద్దదయిన దానివలన ఆ అక్షరమును పరమాత్మగా పోల్చుకొనడమైనది. ఇప్పుడు జీవాత్మ, ఆత్మ, పరమాత్మలను బె, బ్బె, బ్బే మూడు వేరువేరు తేడాలు కల్గిన అక్షరములతో చెప్పడమైనది. క్షర, అక్షర, పురుషోత్తమ అను మూడు ఆత్మలే అయినందున ఒకే శబ్దముతోనే చెప్పడమైనది. ఒకే అక్షర శబ్దములో మూడు తేడాలు చూచి ఒక దానికి ఏత్వము, రెండవ దానికి వత్తు, మూడవదానికి దీర్ఘమును జోడించి, బె, బ్బె, బ్బే అను మూడు విధముల చెప్పడములో, ఒకే ఆత్మ మూడు విధములుగా ఉన్నదని సులభముగా అందరికీ అర్థమైపోగలదు. కొడుకుగా

ఉన్నవానిలోనూ, కొడుకు తండ్రిగాయున్న వానిలోనూ, ఆ తండ్రికి తండ్రిగాయున్నవానిలోనూ మూడు ఆత్మలు ఉండుట వలన నీకూ, నీ అబ్బకూ అని ఇద్దరినీ చెప్పడమైనది. ఇద్దరినే కాదు ఎందరినైనా అలాగే చెప్పవచ్చును. అందరిలో మూడు ఆత్మలుండుట వలన, అందరికీ మూడు అక్షరముల శబ్దములు సరిపోవును. సామెతలో నీకు బె, బ్బె, బ్బే అని ఉండగా, మనము నీకూ, నీ అబ్బకు, నీ తాతకు అందరికీ బె, బ్బె, బ్బే అని చెప్పవచ్చును. ఈ సామెత మూడు ఆత్మల జ్ఞానముతో కూడుకొనియుండుట వలన దీనిని ఎవరివద్దయినా వాడుకోవచ్చును. ఇపుడు నేను చెప్పునది ఏమనగా! నాకు బె, బ్బె, బ్బే, నీకు బె, బ్బె, బ్బే సరిపోయిందా?

## 16. నీ దున్నడములో ఏముంది, ఉండేదంతా నా చల్లడములో ఉంది

ఒక ఊరిలో దామోదర్ అనువాడు, తన పది ఎకరముల పొలమును ఐదుమార్లు దున్ని, సాగు చేసి అందరికంటే సేద్యము బాగా చేసి, తన భూమి అంతయు మెత్తగా మారిపోవునట్లు చేశాడు. దామోదర్ పొలమును చూచినవారంతా అతని సేద్యమును మెచ్చుకొనెడివారు. అంతలో వర్షము వచ్చి భూమి అంతయు బాగా తడిసి, విత్తనములు చల్లుటకు అనువుగా మారినది. అప్పుడు విత్తనములు చల్లుటకు ప్రకాశ్ అనునతడు వచ్చాడు. ప్రకాష్ బాగా దున్నబడిన దామోదర్ పొలములో విత్తనములు చల్లాడు. తర్వాత దామోదర్ ప్రక్కనే గల, దామోదర్ తమ్ముడైన ఫణీందర్ పొలములో కూడా విత్తనములు చల్లాడు. దామోదర్ పొలము బాగాదున్నబడి ఉండగా, అతని తమ్ముడైన ఫణీందర్ పొలములో ఒకమారు మాత్రమే దున్ని పోయాడు. అందువలన ఫణీందర్ భూమి, దామోదర్ భూమి ఉన్నంత మెత్తగా లేదు. అయినా ప్రకాశ్, రెండు పొలములలో విత్తనములు తన తెలివికొద్దీ చల్లాడు.

తర్వాత కొంత కాలమునకు పంట పండింది. దామోదర్ పది ఎకరములలో ఎంత పంట పండినదో, అతని తమ్ముడైన ఫణీందర్ యొక్క పది ఎకరముల పొలములో కూడా అంతే పంట పండినది. ఐదుమార్లు సేద్యము చేసిన దామోదర్‌కు, ఒకమారు సేద్యము చేసిన ఫణీందర్‌కు, ఒకే రకమైన పంట సమానముగా పండడము, దామోదర్‌కు అంతుపట్టలేదు. రెండు పొలము లలో విత్తనములు చల్లిన వాడు ప్రకాశ్ అయినందువలన, ఆ విషయమును దామోదర్ ప్రకాశ్‌ను అడిగాడు. అప్పుడు సావధానముగా దామోదర్ చెప్పిన విషయమును వినిన ప్రకాశ్, దామోదర్‌తో ఇలా చెప్పాడు.

ప్రకాశ్ : నీవు నీ పొలములో ఐదుమార్లు దుక్కిదున్ని భూమిని బాగా మెత్తగా చేశావు. దానివలన పంట బాగా పండవలెను. నీకిప్పుడు, నీవు పడిన శ్రమకు తగినట్లు బాగా పంట పండింది కదా!

దామోదర్ : నేను చేసిన సేద్యమునకు, ఒక ఎకరమునకు పది మూటలు పండాలి. అలాగే నేను అనుకొన్నట్లే పండాయి. అయితే ఒకమారు మాత్రమే దుక్కిదున్నిన నా తమ్మునికి కూడా, ఎకరమునకు పది మూటలు పండాయి. అదెలా పండాయి?

ప్రకాశ్ : మీరు దున్నడములో ఏముంది? ఉండేదంతా నా చల్లడములో ఉంది. నేను చల్లిన నేర్పరితనముతో పంట పండినది. మీరు చేసిన సేద్యము వలననే పంట పండుతుందనుకోవడము పొరపాటు.

దామోదర్ : అయితే విత్తనములు చల్లినది నీవేకదా! నీ నేర్పరితనము వలన ఒకమారు దుక్కి దున్నినవానికి, ఎకరమునకు పదిమూటలు పండితే ఐదుమార్లు దున్నినవానికి, ఎకరమునకు యాభై మూటలు పండవలెను కదా! అలా పండక, ఇద్దరికీ సమానముగా పండాయి కదా!

ప్రకాశ్ : పండిన పంట, ఎకరమునకు పది మూటలకంటే ఎక్కువ పండదు. అదియు సేద్యము బాగా చేసిన పొలములోనే అలా పండుతుంది. నీ తమ్ముని పొలములో అయితే, ఎకరమునకు రెండు బస్తాలే పండవలసి వున్నది. అతడు ఒకమారు దున్నినదానివలన, అంతకంటే ఎక్కువ పండుటకు వీలులేదు. అయితే విత్తనము చల్లిన నా పనితనము మీద ఆధారపడి అతని పొలములో ఎక్కువ పంట వచ్చినది. అతని పొలము మెత్తగా లేదు కనుక విత్తనములు చల్లే సమయములో, విత్తనములు తగిన లోతులో పడునట్లు భూమికేసి విత్తనములను విసరడము జరిగినది. అలా బలముగా విత్తనము లను, భూమిమీదికి విసరడము వలన భూమిలో అవి తగిన లోతులో పడి సరియైన పంటనిచ్చాయి. నీ పొలము మెత్తగా ఉండుట వలన, నేను విత్తనములను పైకి చల్లడము వలన, అవి ఎంత లోతులోనికి పోవాలో అంతే లోతులోనికి పోయి, మొలకెత్తి పంటనిచ్చాయి. ఒకవేళ అతని పొలములో విత్తనములను చల్లినట్లే, నీ పొలములో చల్లివుంటే, భూమి మెత్తగా ఉండడము వలన, విత్తనములు చాలా లోతులో పడి, తగిన సమయమునకు మొలకెత్తి బయటికి రాలేక, పంట సరిగా పండక నష్టము వచ్చేది. అలా కాకుండా, నీ పొలములో విత్తనములను పైకి విసరడము జరిగినది. నీ తమ్ముని పొలములో భూమికేసి, క్రిందికి విసరడము జరిగినది.

దామోదర్ : అయితే నేను ఎక్కువగా దున్నినదానికంటే, నీవు చల్లిన పని తనమే ఎక్కువైనది.

ప్రకాశ్ : అవును. నీవు పడిన శ్రమకు సరిపోవు పంట వచ్చినది. నీ తమ్ముడు తక్కువ శ్రమపడినా, ఒకమారే దున్నినా, అతనికి కూడా మంచి పంట వచ్చునట్లు విత్తనములను చల్లాను. అందువలన దున్నేవాని పని

తనముకంటే, విత్తనములను చల్లేవాని పనితనమే ఎక్కువని చెప్పుచున్నాను. నేను చెప్పడమే కాకుండా నా మాట నిజమని ప్రత్యక్షముగా తెలిసినది కదా!

ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. ఈ సామెతలో దున్నడము, విత్తనములు చల్లడము మాత్రమే కనిపించినా, ఈ సామెత యొక్క అసలు ఉద్దేశ్యము వేరు. జిజ్ఞాస కల్గినవారు జ్ఞానము కొరకు పడే శ్రమకంటే భగవంతుడు అందించు విధానము వలననే ఎక్కువ జ్ఞానము కల్గుచున్నది. ఉదాహరణగా చెప్పుకొంటే, జ్ఞానము తెలియాలను జిజ్ఞాస కల్గినవాడు ఒకడు, ఎన్నో ఊర్లు తిరిగి ఒక గురువును ఆశ్రయించాడు. ఆ గురువు జ్ఞానమునే చెప్పునట్లు ఎన్నో ఉపన్యాసములను చెప్పినా, అందులో ఆత్మజ్ఞానము మచ్చుకైనా లేదు. ఆయన పురాణముల కథలను చెప్పడమూ, భక్తి రస పాటలను పాడడమూ, మంత్రోపదేశము చేయడమూ, ధ్యానములో కూర్చుండ బెట్టి ధ్యాన సాధన చేయించడమూ జరిగెడిది. ఆ విధముగా కొన్ని సంవత్సరములు జరిగినది. ఆ గురువును ఆశ్రయించిన వారందరికీ మేము ధ్యానము చేయుచున్నామను తృప్తి ఉండెడిది. అంతలో వారికి ఒక వ్యక్తి తటస్థపడి, ఆత్మజ్ఞానమును గురించి వారికి తెలియదని గ్రహించి, ఎవరికి ఎలా చెప్పాలో అలా చెప్పుటకు మొదలిడెను. ముందు, వారిలో ఎన్నో ప్రశ్నలను రేకెత్తులాగ చేసి, ఆ ప్రశ్నలకు తమకు జవాబు తెలియదని వారికి అర్థమగునట్లు చేసి, వారి ధ్యాసను జవాబు కొరకు మళ్ళించి, జ్ఞానమును చెప్పగా! అప్పుడు వారికి పూర్తిగా జ్ఞానమర్థమైనది. మేము తెలిసినవారమనీ, ధ్యానము కూడా చేయుచున్నామనీ, తమను తాము గొప్పగా తలచుకొని ఉన్నవారికి, జ్ఞానమార్గములో అనుమానములను రేకెత్తించి, వాటి విషయము తమకు తెలియదనుకొనునట్లు చేసి, తర్వాత

జ్ఞానమును చెప్పడము వలన అందరూ జ్ఞానులుగా మారిపోయి, మొదటి గురువువద్ద ఏమీ లభించలేదనుకొనునట్లు చేశాడు. దీనినిబట్టి చూస్తే, వినేవాని శ్రమకంటే చెప్పేవాని పనితనము ఎక్కువ ఉండాలని తెలియు చున్నది. వినే శిష్యులు దుక్కి దున్నిన రైతులలాంటివారు. చెప్పే బోధకుడు విత్తనమును చల్లేటువంటివాడు. దున్నేవానికంటే అదను చూచి, అవసరమును బట్టి, విత్తనమును విత్తువాడే గొప్పవాడు. అలాగే తెలుసుకొను శిష్యులకంటే తెలియజేప్పే గురువు గొప్పవాడు. వినేవానికంటే చెప్పేవానిదే ఎక్కువ పనితనము. అందువలన ఆ విషయమును, “నీ దున్నడములో ఏముంది, ఉండేదంతా నా చల్లడములో ఉంది.” అని సామెత రూపములో చెప్పారు.

## 17. పక పక నవ్వేవాడొకడు, గబ గబ అరిచేవాడొకడు, మిట మిట చూచేవాడొకడు

ఒకచోట ఒక సభ జరుగుచుండెను. ఆ సభలో ఒక ముఖ్య అతిధి ఒకాయన ఉండెను. ఆ సభలో ఒక ఉపన్యాసకుడుండెను. సభ జరుగుచుండు సమయములో, ఉపన్యాసకుడు అక్కడి సమస్యలను గురించి సందర్భానుసారముగా, చాకచక్యముగా మాట్లాడుచుండెను. ఆ ఉపన్యాసము చెప్పు వ్యక్తి మాటలకు, అక్కడ కూర్చున్న ప్రజలు అప్పుడప్పుడు చప్పట్లు కొట్టుచూ పక పక నవ్వుచుండిరి. మాట్లాడే వ్యక్తి, గబ గబ మాట్లాడు చుండెను. ఆ సభకు ముఖ్య అతిధిగా వచ్చినవాడు, చెప్పేవాని ప్రక్క, విని నవ్వే వారి ప్రక్క మిట మిట చూచుచుండెను. మాటలు విని, చప్పట్లు కొట్టి, నవ్వే ప్రజలు ముందర కూర్చొనియుండగా, ఉపన్యాసమును చెప్పే

వ్యక్తి ప్రజలకు ఎదురుగా నిలబడి చెప్పుచుండెను. ముఖ్య అతిథి కూడా ప్రక్క కుర్చీలో కూర్చొని, చెప్పేదాన్ని అంతటినీ వింటున్నాడు. క్రింద కూర్చున్న ప్రజలు, తాము విన్న మాటలలోని ఆనందమును అనుభవిస్తూ, అప్పుడప్పుడు నవ్వుచుండగా, అతిథిగా అక్కడున్న వ్యక్తి కూడా తాను ఏమీ చేయకుండా ఊరక కూర్చొని, చెప్పేవానినీ, వినేవారినీ ఇద్దరినీ చూచుచుండెను. ఉపన్యాసకుడు మాత్రము మాట్లాడే పనిని చేయుచుండెను. ఇదంతా చూస్తే, మనకు మూడు పాత్రలు కనిపిస్తున్నవి. ఒకడు చెప్పే పనిని చేయుచుండగా, విని ఆనందించేవాడు ఒకడుండగా, చెప్పే వానిని విని సంతోషపడు వారిని చూచేవాడు మరొకడున్నాడు. రెండు పాత్రలు పని లేకుండా ఉండగా, ఒక పాత్ర మాత్రము అరిచి చెప్పే పనిని చేయుచున్నది.

ఇటువంటి మూడు పాత్రలు బయట ఎలాగున్నవో, అలాగే మన శరీరములో కూడా ఉన్నవి. శరీర ప్రాంగణములో ఉపన్యాసకుడువలె ఆత్మయుండగా, విని అనుభవించువానివలె జీవుడుండగా, చెప్పేవానిని, వినే వానిని ఇద్దరినీ చూచు అతిథిలాగ పరమాత్మయున్నాడు. శరీరములో జీవాత్మ, పరమాత్మ ఇద్దరూ పని చేయువారు కాదు. జీవాత్మ మాత్రము ఆత్మ చేయగా, తనవరకు వచ్చు సుఖదుఃఖములను మాత్రము, అనుభవించు చున్నది. శరీరములో ఆత్మ మాత్రము సర్వకార్యములను, ఎల్లవేళల చేయుచునే ఉన్నది. ప్రతి శరీరములోను జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను మూడు ఆత్మల పాత్రలు నిత్యమూ జరుగుచునే ఉన్నవి. శరీరములో జీవాత్మ అనుభవించునది మాత్రమేనని, కార్యములన్నిటినీ చేయునది ఆత్మ ఒక్కటేననీ, జీవాత్మ, ఆత్మలకు సాక్షిగా ఉంటున్నది పరమాత్మయనీ తెలియునట్లు, ఆత్మ జ్ఞానమును తెలిసిన జ్ఞానులు 'పక పక నవ్వేవాడొకడు, గబ గబ అరిచే వాడొకడు, మిట మిట చూచేవాడొకడు" అని చెప్పారు.

పక పక నవ్వేవాడు = జీవాత్మ (సుఖదుఃఖములను అనుభవించువాడు)
గబ గబ అరిచేవాడు = ఆత్మ (అన్ని పనులను చేయువాడు)
మిట మిట చూచేవాడు = పరమాత్మ (సాక్షిగా, మౌనముగా చూచువాడు)

## 18. పుట్టనివాడు, గిట్టని వాడు, గోడ బొమ్మలో ఉన్నవాడే

గోడమీద ఏదో ఒక బొమ్మ ఉంటుంది. బొమ్మ అంటే ఏదో ఒక దేవుని బొమ్మ అనుకోండి. ముప్పది మూడుకోట్ల దేవతల బొమ్మలలో ఏ దేవత బొమ్మయినా కావచ్చు. లేకపోతే ఏ సినిమా బొమ్మయినా కావచ్చును. ఒక పట్టణములో వెడల్పున్న గోడకు సినిమా హీరోయిన్ బొమ్మను అతికించి పెట్టారు. గోడ వెడల్పునా పెద్దసైజులో అతికించబడిన ఆ హీరోయిన్ బొమ్మ శరీరమంతా, దుస్తులు పూర్తిగా లేకుండా, చాలీచాలని దుస్తులతో అందముగా కనిపిస్తువుంది. చిన్న చెడ్డీ ధరించిన ఆ బొమ్మను ఎక్కువ మంది ఎక్కువ ఆసక్తితో చూచుచున్నారు. దానికి ప్రక్క బజారులో ఒక గోడకు శ్రీ వెంకటేశ్వర స్వామి బొమ్మను అతికించి, వెంకటేశ్వర కళ్యాణము ఫలాన దినము, ఫలానా స్థలములో జరుగునని వ్రాసియుంచారు. అయితే ఆ బొమ్మను ఎవరూ ఆసక్తిగా చూడడములేదు. ప్రక్క బజారులో హీరోయిన్ బొమ్మతో పోల్చి చూచితే, నూటికి ఒకరిద్దరుగానీ వెంకటేశ్వర చిత్రపటమును చూడడము లేదు. ఈ విధముగా మనుషులలోని ఆసక్తి అంతయు, సినిమా బొమ్మలమీదే ఎక్కువగా ఉండడమూ, దేవతల బొమ్మల మీద కూడా ఆసక్తి లేకుండాపోవడమూ ప్రత్యక్షముగా కనిపిస్తున్నది.

ఇప్పుడు చెప్పిన సామెతలో, గోడమీద బొమ్మలో ఉన్నవాడు పుట్టని వాడు, గిట్టనివాడు అని వ్రాయబడి ఉన్నది. పుట్టనివాడు, గిట్టనివాడు

భూమిమీద ఎవడూ లేడు. పుట్టడము, చావడము ప్రతి మనిషికీ, ప్రతి జీవరాశికీ, తప్పనిసరిగా జరుగుచున్న పనిగా ఉన్నది. గోడమీద ఉన్న హీరోయిన్ పుట్టింది. తర్వాత తప్పక మరణించవలసిందే. అలాగే కనిపించేది ఏదైనా నాశనము కాక తప్పదు అను సూత్రము ప్రకారము, వెంకటేశ్వరునికి కూడా ఒకానొక రోజు చావు తప్పదు. అయితే చావుపుట్టుకలు లేనివాడు ఒకడే ఒకడున్నాడు, అతడే దేవుడు. ఆయనను భగవద్గీతలో జ్ఞానయోగము నందు ఆరవ శ్లోకమున "అజోపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోపిసన్" "సర్వజీవరాసులకు దేవుడైన వానికి నాశనముగానీ, పుట్టుకగానీ లేదు" అని చెప్పబడివున్నది. దీనినిబట్టి పుట్టనివాడు, అట్లే గిట్టనివాడు దేవుడని తెలియుచున్నది. అయితే ఇదే భగవద్గీతలోనే పుట్టని, గిట్టని దేవునికి ఆకారము లేదనీ, పేరూ లేదనీ తెలుపబడినది. రూప, నామ, క్రియలు లేని వాడు దేవుడు అని శాస్త్రబద్ధమైన శాసనమున్నపుడు, ఆకారమున్న గోడమీద బొమ్మను పుట్టనివాడు, గిట్టనివాడు అని అనుటకు వీలులేదు. అయితే జ్ఞానమును తెలిసిన పెద్దలు, సామెతను తయారు చేసినప్పుడు, వారు అన్ని విధములా యోచించి వాస్తవమునే చెప్పియుందురు. "అలాంటపుడు శాస్త్రమునకూ, చెప్పినమాటకూ పొంతన కుదరదు కదా! అటువంటి ఈ సామెతను పెద్దలు ఎందుకు చెప్పారు?" అని కొందరడుగ వచ్చును. దానికి మేము జవాబును ఈ విధముగా చెప్పుచున్నాము.

గోడమీద వెంకటేశ్వరుని బొమ్మను చూసి, బొమ్మలో ఉన్నవాడే దేవుడు అంటే కొందరు ఒప్పుకోవచ్చును. అయితే ప్రక్క వీధిలోని గోడమీద హీరోయిన్ బొమ్మను చూపి, ఈ బొమ్మే దేవుడు అంటే ఎవరూ ఒప్పుకోరు. చివరకు ఏమీ తెలియని అజ్ఞానులు కూడా ఒప్పుకోరు. అలాంటపుడు పుట్టని, గిట్టని వాడు గోడ బొమ్మలో ఉన్నాడు అని ఎందుకు చెప్పవలసి

వచ్చినదని వివరించుకొని చూస్తే, దేవుడు రూపము లేకుండా సర్వమూ వ్యాపించియున్నాడు. అంతటా వ్యాపించిన వాడు, గోడ బొమ్మలో కూడా ఉన్నాడు కదా! అలాంటపుడు, అక్కడున్న బొమ్మ ఏదైనా కానీ, దానిని దేవుడని చెప్పడములో తప్పులేదు. అక్కడున్నది హీరోయిన్ బొమ్మయినపుడు, "అది స్త్రీ బొమ్మగును కదా! స్త్రీ బొమ్మలో కూడా దేవుడుంటాడా? అసభ్యకర మైన బొమ్మలో కూడా దేవుడుంటాడా?" అని కొందరు ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! బొమ్మ ఆడదా, మగదా అనునది సారాంశము కాదు. బొమ్మలో దేవుడు వ్యాపించియున్నాడా లేదా అనునదే ముఖ్యమైనది. దేవుడు అణువణువునా వ్యాపించియున్నపుడు, ఆడబొమ్మయందుగానీ, మగ బొమ్మయందుగానీ, ఆడవారియందుగానీ, మగవారియందుగానీ, వేశ్య యందుగానీ, సన్యాసియందుగానీ దేవుడు సమానముగా ఉన్నాడని తెలియు చున్నది. దీనినిబట్టి చావుపుట్టుకలు లేని దేవుడు, ఒక బొమ్మలో ఉంటాడని చెప్పడములో తప్పులేదు కదా! అందువలన మన పెద్దలు " పుట్టనివాడు గిట్టనివాడు గోడ బొమ్మలో ఉన్నవాడే" అని సామెతగా చెప్పారు. ఈ సామెతలో, దేవుని జ్ఞానము ఎంతో ఇమడ్చబడియున్నదని తెలియుచున్నది.

## 19. పురుషులందు పుణ్య పురుషులు వేరయా

స్త్రీలు, పురుషులను కలిపి మనుషులుగా, మానవులుగా చెప్పు చున్నాము. మానవులలో, వారి భౌతిక దేహమునుబట్టి వీరు పురుషులనీ, వీరు స్త్రీలని గుర్తించుచున్నాము. మనుషులలో స్త్రీ, పురుషులు అను రెండే జాతులున్నా, స్త్రీ జాతిలో రెండు రకముల స్త్రీలు, అలాగే పురుషులలో రెండు రకముల పురుషులు కలరు. స్త్రీలలోగానీ, పురుషులలోగానీ, వారి

శరీరములో తయారగు హార్మోనులనుబట్టి, స్త్రీలలో రెండు రకముల స్త్రీలని, పురుషులలో రెండు రకముల పురుషులున్నారనీ చెప్పవచ్చును. ఇదంతయు భౌతికశాస్త్రమునకు సంబంధించిన విషయమే. స్త్రీలలో మాచకమ్మలను వారు కూడా ప్రత్యేకముగా కలరు. అలాగే పురుషులలో నపుంసకులను వారు కూడా కలరు. దీనినిబట్టి స్త్రీలలో ఒకటి స్త్రీలు, రెండు మాచకమ్మలను వారుండగా, పురుషులలో ఒకటి పురుషుడు, రెండు నపుంసకుడు అనువారు కలరు. స్త్రీలలో మాచకమ్మలనువారికి ఆడతనముండదు. మాచకమ్మది స్త్రీ శరీరమే అయినా ఆమెకు ఆడతనముండదు. అలాగే పురుషులలో నపుంసకులనువారికి, మగతనముండదు. నపుంసకునికి మగ శరీరమే ఉండినా అతనికి మగతనముండదు. నపుంసకులను చాలామంది చూచి వుందురు. అయితే మాచకమ్మలను ఎవరూ చూచియుండరు. సమాజములో మాచకమ్మలు ఎందరో ఉండినా, నపుంసకులు బయటపడినట్లు మాచకమ్మలు బయటపడరు. శరీరములను బట్టి స్త్రీ, పురుషులని రెండు రకములుగా మనుషులను గుర్తించినా మగవారిలో పురుషులు, నపుంసకులు అను రెండు రకములవారూ, ఆడవారిలో స్త్రీలు, మాచకమ్మలని రెండు రకముల వారూ, మొత్తము నాలుగు రకములవారు కలరని తెలియుచున్నది.

ఇంతవరకు స్త్రీ, పురుషులను భౌతికశాస్త్రము ప్రకారము చెప్పుకొన్నాము. ఇప్పుడు శాస్త్రములలో పెద్దదైన బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము వివరించుకొని చూస్తే, పురుషులలో రెండు రకములు, స్త్రీలలో రెండు రకములు కలరని తెలియుచున్నది. భౌతికశాస్త్రము ప్రకారము మగవారిలో పురుషులు, నపుంసకులు అని రెండు రకములుగా ఉండగా, బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము మగవారిలో పురుషులు, స్త్రీలు అని రెండు రకములూ, ఆడవారిలో స్త్రీలు, పురుషులు అని రెండు రకములూ కలరు.

ఇక్కడ విచిత్రమేమంటే, పురుషులకు పూర్తి భిన్నమైన స్త్రీలను పురుషులలో చేర్చి చెప్పడము విశేషముకాగా, అలాగే స్త్రీలకు పూర్తి భిన్నముగా ఉన్న పురుషులను, స్త్రీలలో చేర్చి చెప్పడము కూడా విశేషమే. బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము ఎందుకలా చెప్పబడినారని పరిశీలించి చూచితే ఈ విధముగా తెలియుచున్నది. ఉప్పు, కప్పురంబు నొక్క పోలికయుండు, చూడ చూడ రుచులు వేరయుండు, పురుషులందు పుణ్యపురుషులు వేరయా అని ఒక యోగి చెప్పిన వాక్యమిది. ఉప్పు, కర్పూరము రెండూ ఆకారములో ఒకటి గానే కనిపించినా, వాటి రుచులలో ఎంతో తేడా కనిపించును. అదే విధముగా, పురుషులందు పుణ్య పురుషులు వేరని వేమనయోగి చెప్పాడు. వేమనయోగి చెప్పిన ప్రతి పద్యములోనూ ఎంతో గొప్ప జ్ఞానము ఇమిడి యుంటుంది. అన్ని విధముల, జ్ఞానము ప్రకారము గమనిస్తే, దైవత్వమును తెలియగోరువారు, దేవుని జ్ఞానము కలవారిని పురుషులనీ, దైవజ్ఞానము ఏమాత్రము లేని వారిని స్త్రీలనీ చెప్పవచ్చును.

పురుషులలో దైవజ్ఞానములేనివారిని స్త్రీతత్త్వముగలవారిగా, దైవ జ్ఞానమున్నవారిని పురుషతత్త్వమున్న వారిగా లెక్కించవచ్చును. అలాగే స్త్రీలలో కూడా, దైవజ్ఞానము గలవారిని పురుషత్వమున్నవారిగా, దైవజ్ఞానము లేనివారిని స్త్రీ తత్త్వముగలవారిగా లెక్కించవచ్చును. ఈ సూత్రము ప్రకారము పురుషులలో మగవారి క్రిందికి కొందరినీ, ఆడవారి క్రిందికి కొందరిని జమకట్టవచ్చును. ఉప్పు, కప్పురమూ రెండూ ఒకే ఆకారమును పొంది యున్నట్లు, అందరూ మగవారే అయినా, చూడచూడ రుచులు వేరన్నట్లు వారిని పరిశీలించి చూచితే, వారి అజ్ఞాన భావములను అనుసరించి వారిలో కొందరు స్త్రీలుగా ఉన్నట్లు తెలియుచున్నది. బ్రహ్మవిద్య ప్రకారము పురుషులలో స్త్రీలు ఉన్నారనీ, స్త్రీలలో పురుషులున్నారని చెప్పుచున్నాము.

స్థూలముగా పురుషులే అయినా, జ్ఞానము లేనిదానివలన కొందరిని సూక్ష్మముగా స్త్రీలవలె లెక్కించవలెను. జ్ఞానము ప్రకారము పురుషులలోనే జ్ఞానము తెలిసినవారిని పురుషులుగా, జ్ఞానము లేనివారిని స్త్రీలుగా లెక్కించితే, పురుషులందు పుణ్యపురుషులు ఎవరని ప్రశ్న రాగలదు. జ్ఞానము తెలిసినవారు ఆడవారైనా, మగవారైనా పురుషులని చెప్పుకొన్నపుడు ప్రత్యేకించి పుణ్యపురుషులు ఎవరైవుంటారు? వారు పురుషులకంటే శ్రేష్ఠమైన వారా అని కూడా అనుమానము రాగలదు. దానికి జవాబును చూస్తే ఈ విధముగా కలదు.

పురుషులు అంటే దేవుని జ్ఞానము కలవారనీ, దేవుని జ్ఞానము కొరకు ప్రయత్నించువారనీ చెప్పుకొన్నాము. దేవుని ధర్మములను ఆచరించు వారందరూ ఎవరైనా పురుషులే. దేవుని ధర్మములు కొంత తెలియకుండా పోయి, ధర్మముల స్థానములో అధర్మములుండినపుడు, దేవుని మార్గములో పోవాలనుకొన్న మనిషి, అధర్మములను ధర్మములనుకొని ఆచరించును. ధర్మములను ఆచరించినా, అధర్మములను ఆచరించినా, దేవుని జ్ఞానము యొక్క ఉద్దేశ్యము వలన వారిని పురుషులనియే చెప్పవచ్చును. అయితే ధర్మములను ఆచరించువానికి పాపముగానీ, పుణ్యముగానీ రాదు. అతడు కర్మను దహించుకొన్న వాడై మోక్షము పొందుటకు అవకాశము ఏర్పడును. ఒకవేళ ధర్మముల స్థానములోనున్న అధర్మములను ఆచరించువాడు కూడా పురుషుడే అయినా వానికి పుణ్యఫలము చేకూరును. ఆచరించినది అధర్మమైన దానివలన పుణ్యము రావడము జరుగుచున్నది. ఈ విషయమును భగవద్గీత అక్షర పరబ్రహ్మయోగమను అధ్యాయమున, 28వ శ్లోకమునందు చెప్పారు.

శ్లో॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు యత్పుణ్య ఫలంప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా యోగీ పరంస్థాన ముపైతి చాద్యమ్॥

భావము : "సంపూర్ణమైన జ్ఞానమును తెలిసినవాడు, వేదముల వలన, యజ్ఞముల వలన, తపస్సుల వలన, దానముల వలన కలుగు పుణ్య ఫలమును అతిక్రమించి యోగియై ముక్తిని పొందగలడు". దైవజ్ఞానము మీద ఆసక్తియుండినవాడు, తాను ఆచరించునది ధర్మమే అనుకొని అధర్మమును ఆచరించితే, అతనికి ముక్తి లభించదు. అతడు యోగి కాలేదు. అయితే అతనికి పుణ్యము వచ్చును. దేవుని జ్ఞానమును ఆశ్రయించవలెనను తలంపుయున్నవాడు, ధర్మములనుకొని, తెలియక అధర్మములను ఆచరించినా, వాడు పురుషుని క్రిందికే జమవేయబడును. అధర్మములైన వేదముల వలన, యజ్ఞముల వలన, తపస్సులవలన, దానముల వలన పుణ్యము వచ్చి వారు మోక్షమును పొందరు. కావున "పురుషులందు పుణ్యపురుషులు వేరయా" అని వేమనయోగి చెప్పాడు. ఆ మాటనే ప్రజలు సామెతగా వాడుచున్నారు. ఈ మాట పైకి కనిపించుటకు సర్వ సాధారణముగా ఉండినప్పటికీ, పురుషుడు అనుమాటకు ఎంతో భావమును చూపుచున్నది. మూతికి మీసమున్న వారు పురుషులనీ, లేనివారు స్త్రీలనీ అనుకొనుటకు వీలులేదు. జ్ఞానరీత్యా స్త్రీలను కూడా పురుషులుగా పరిగణించవచ్చని తెలియుచున్నది. అలా పురుషులుగా లెక్కించబడువారు ఎవరైనా గానీ, అధర్మములను ఆచరించుటవలన పుణ్యపురుషులగుచున్నారనీ, ధర్మములను ఆచరించినవారు మోక్ష పురుషులగుచున్నారనీ తెలియుచున్నది.

## ౨౦. పల్లె తిరిగినా ఏడే చీరలు, పట్నమ్ తిరిగినా ఏడే చీరలు

పల్లెలు వ్యవసాయ కేంద్రములని చెప్పవచ్చును. అలాగే పట్నములు వ్యాపార కేంద్రములని చెప్పవచ్చును. పట్టణములకు రహదారులు ఉండును, పల్లెలకు చిన్న దారులుండును. పట్టణములన్నీ రహదారి వెంట ఉండును. పల్లెలు ఒకే దారిలో లేకుండా, అక్కడొకటి,అక్కడొకటి విసరి వేసినట్లుండును. మన భారతదేశములో పల్లెలు, పట్టణములు ఇలా ఉండగా, 'ఇందుశ్రీ' అను దేశములో, భారతదేశములో ఉన్నట్లే పల్లెలు పట్టణములు ఉన్నవి. ఇందుశ్రీ దేశమునకు, 'బ్రహ్మశ్రీ' అను మరియొక పేరు కూడా కలదు. అది జ్ఞానులకు నిలయమైన దేశము కావున, ఇందుశ్రీ అనడము జరిగినది. ఆ దేశము ఒక్క జ్ఞానులకేకాక, యోగులకు కూడా నిలయమైన దేశము. కావున ఆ దేశమునకు 'బ్రహ్మశ్రీ' అను పేరు కూడా వచ్చినది. జ్ఞానులకు, యోగులకు నిలయమైనదే కాకుండా, ధనికులకు కూడా నిలయమైన దేశము కావున, ఆ దేశమునకు 'రాజశ్రీ' అను పేరు కూడా కలదు. ఇందుశ్రీ, బ్రహ్మశ్రీ, రాజశ్రీ అను మూడు పేర్లు గల ఆ దేశములో, దేశము మొత్తము మీద ఏడు పట్టణములు, ఏడు పల్లెలు మాత్రము కలవు. దేశమంతా కలిపిన, 14 ఊర్లుండగా, అందులో ఏడు పట్టణములు, ఏడు పల్లెలు మాత్రము కలవు. ఒక చీరల వ్యాపారస్థుడు, ఊర్లు తిరిగి చీరలు అమ్ముకొనేవాడు. అతడు తన చీరల మూటను తీసుకొని, ఇందుశ్రీ దేశములో మొదట, రహదారి వెంటనున్న పట్టణములలో తన వ్యాపారమును సాగించుటకు పోయాడు. ఇందుశ్రీ దేశము తూర్పు, పడమట కొద్దిగా విస్తరించి, దక్షిణము నుండి ఉత్తరమువైపు పొడవుగల్గి, జపాన్ దేశమున్నట్లు ఉన్నది. చీరల

వ్యాపారస్థుడు మొదటిరోజు దక్షిణ దిశనుండి తన వ్యాపారమును ప్రారంభించాలనుకొన్నాడు. దక్షిణము మొదలుకొని ఉత్తరము వరకు ఏడు పెద్ద పట్టణములు గలవు. చీరల వ్యాపారస్థుడు దక్షిణ ప్రాంతములోగల పాడ్యమి అను పట్టణముతో వ్యాపారమును మొదలు పెట్టాడు. పాడ్యమి పేరుకు పట్టణమేగానీ, చాలా తక్కువ జనాభాగల పట్టణము. వ్యాపారస్థుడు ఆ నగరమంతా తిరిగి వ్యాపారమును సాగించాడు. పాడ్యమి నగరములో జనాభా మొత్తము కేవలము ఆరువందలు (600) మాత్రమే గలరు. పాడ్యమి పట్టణమంతా అయిపోయిన తర్వాత చూచుకొంటే, ఏడు (7) చీరలు అయి పోయాయి. తర్వాత ఉత్తర దిక్కుగానున్న 'విదియ' అను రెండవ పట్టణమునకు వ్యాపారస్థుడు పోయాడు. విదియ పట్టణము, ఆరువేల (6000) జనాభా గల పట్టణము అయినందున, తన చీరలు ఎక్కువగా అమ్ముడైపోతాయని అనుకొన్నాడు. అయితే ఆ పట్టణమంతా ఓపికగా తిరిగి అమ్మినా ఏడే (7) చీరలు పోయాయి. అక్కడినుండి తదియ అను మూడవ పట్టణమునకు పోయిన వ్యాపారస్థుడు, తన వ్యాపారమును కొనసాగించాడు. తదియ పట్టణము యొక్క జనాభా ఆరువేల (6000) మంది. అక్కడ కూడా ఏడే (7) చీరలు పోయాయి. తర్వాత చవితి అను నాల్గవ పట్టణమునకు వ్యాపారస్థుడు పోయాడు. ఆ నాల్గవ పట్టణములో కూడా జనాభా (6000) మంది మాత్రమేగలరు.

చవితి పట్టణములో కూడా ఏడు (7) చీరలు మాత్రము అమ్ముడు పోయాయి. అక్కడనుండి పంచమి అను ఐదవ పట్టణమునకు పోయాడు. పంచమి పట్టణములో జనాభా వేయి (1000) మంది మాత్రమే గలరు. వ్యాపారస్థుడు పంచమి పట్టణమంతా తిరిగి తన చీరలను అమ్ముకోగా అక్కడ కూడా ఏడు (7) చీరలు మాత్రము పోయాయి. తర్వాత ఆ వ్యాపారి

షష్ఠి అను ఆరవ పట్టణముకు పోయాడు. ఆరవ పట్టణములో కూడా ఏడు చీరలు (7) మాత్రము పోయాయి. విచిత్రమేమంటే ఆరవ పట్టణములో కూడా జన సంఖ్య వేయి (1000) మంది మాత్రమే గలరు. ఇక చివరిది, ఏడవది, దేశమునకు రాజధాని అయిన సప్తమి అను పట్టణమునకు వ్యాపారి పోయాడు. అది ఇందుశ్రీ దేశమునకు రాజధాని అయినా, అందులో కూడా జనసంఖ్య వేయి (1000) మంది మాత్రమే. అతను, అక్కడ కూడా వ్యాపారమును సాగించగా, అక్కడ కూడా ఏడు (7) చీరలు మాత్రము అమ్ముడు పోయాయి. ఈ విధముగా వ్యాపారి, ఏడు పట్టణములను తిరుగగా, ఒక్కొక్క పట్టణములో ఏడు చీరల ప్రకారము, మొత్తము 49 చీరలు అమ్ముడు పోయాయి. పూర్తిగా ఏడు పట్టణములను తిరిగి, వ్యాపారి ఇక పల్లెలను చూడాలనుకొన్నాడు. సప్తమి పట్టణమునకు అతి సమీపములోనున్న పల్లెకు రెండవరోజు పోవాలనుకొన్నాడు.

సప్తమి పట్టణమునకు దగ్గరగానున్న పల్లెటూరి పేరు అష్టమి. అష్టమి చిన్న పల్లెటూరే అయినా, సప్తమి పట్టణముకంటే చాలా బాగుంది. అక్కడి జనాభా ఎంత ఉందో తెలియదుగానీ, మొత్తానికి అక్కడ కూడా ఏడు (7) చీరలే పోయాయి. అక్కడినుండి దక్షిణ దిశగా బయలుదేరిన వ్యాపారి నవమి అను పల్లెకు వచ్చాడు. అక్కడ కూడా ఎంత తిరిగి అమ్మినా, ఏడు (7) చీరలు మాత్రము పోయాయి. తర్వాత దశమి అను పల్లెకు వచ్చాడు, అక్కడ కూడా ఎంత జనాభా ఉన్నదో తెలియదు. కానీ అక్కడ కూడా ఏడు (7) చీరలు అయిపోయాయి. అక్కడనుండి ఏకాదశి పల్లెకు వచ్చాడు. అక్కడ కూడా ఏడే (7) చీరలు పోయాయి. తర్వాత ద్వాదశి, ఆ తర్వాత త్రయోదశి అను పల్లెలను, ఆ వ్యాపారి తిరిగాడు. ఆ రెండు పల్లెలలోను ఒక్కొక్క ఊరిలో, ఏడు చీరలు ప్రకారము, రెండు ఊర్లలో

పదునాలుగు (14) చీరలు అమ్ముడు పోయాయి. ఇక చివరిలోనున్న చతుర్దశి అను పల్లెకు వచ్చాడు. అక్కడ కూడా ఏడు (7) చీరలు మాత్రమే ఖర్చు కావడము జరిగినది. మొత్తము ఏడు పల్లెలలో ఎంత జనాభా ఉన్నదని విచారించగా, చివరి ఊరిలోనున్న ఒక రెవెన్యూ అధికారినుండి తెలిసిన సమాచారము ప్రకారము, 21,600 మంది ఏడు ఊర్లలో ఉన్నట్లు తెలిసింది. ఏడు పట్టణములలోనున్న జనాభాతో సమానముగా, ఏడు పల్లెల జనాభా ఉండడము విచిత్రముకాగా, అన్ని పట్టణములలోను, పల్లెలలోను ప్రతిచోటా ఏడు చీరలు పోవడము మరీ విచిత్రము! ఇందుశ్రీ దేశము మొత్తము పల్లె పట్టణములు పదునాలుగు కాగా, మొత్తము జనాభా 43,200 (ఒక పగలు 12 గంటలకు, మొత్తము సెకండ్లు 43,200, అని మేము **"కలియుగము"** అను గ్రంథములో వ్రాసినది జ్ఞప్తికుంచుకోవలెను).

ఇదంతయు చదివిన తర్వాత, పల్లెలు, పట్టణములు, చీరలు, వ్యాపారము ఇదంతా దేనికి? ఇందులో ఏమి జ్ఞానమున్నదని కొందరు ప్రశ్నించ వచ్చును. దానికి మేము చెప్పునదేమనగా! మానవ జీవితములో ఏడు (7) సంఖ్య చాలా ప్రాముఖ్యమైనది. అంతేకాక, ఒక సూర్య కిరణమును విభజించి చూచితే ఏడు భాగములగుచున్నది. వారమునకు ఏడు దినములున్నవి. ఇవన్నిటికీ మించి, ఇంత కథ చెప్పడము వెనుక ముఖ్యమైన జ్ఞానమున్నది. మానవుని శరీరములో తలనుండి గుదస్థానము వరకు వ్యాపించియున్న వెన్నెముకలో, వెన్నుపాము అను పెద్ద నరమున్నది. వెన్నుపాము అను నాడిని, ఆధ్యాత్మిక భాషలో బ్రహ్మనాడి, సుషుమ్న నాడి అని కూడ అందురు. ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. వెన్నుపామును లేక బ్రహ్మనాడిని పై కథలో చెప్పిన రహదారిగా లెక్కింతుము. ఈ నేపథ్యములో, మనిషి శరీరమును ఇందుశ్రీ దేశముగా చెప్పుచున్నాము.

ఇందుశ్రీ దేశములో ఏడు పట్టణములు, ఏడు పల్లెలున్నట్లు మనిషి శరీరములో ఏడు నాడీకేంద్రములు పట్టణములుగా, ఏడు గ్రంథులు పల్లెలుగా ఉన్నట్లు తలచవలెను. రహదారిగా లెక్కించుచున్న బ్రహ్మనాడిలోనున్న, ఏడు నాడీకేంద్రములు ఏడు పట్టణములుగా తెలిసితే, ఏడు నాడీకేంద్రములు ఒక దినమునకు, 21,600 శ్వాసలు జరుపు చున్నవి. ఈ సంఖ్యనే, ఏడు పట్టణముల జనాభాగా చెప్పుకొన్నాము. శరీరములోని ఏడునాడీ కేంద్రములు పట్టణములుగా గుర్తించినట్లే, మన శరీరములోని ఏడు గ్రంథులను, కథలోని ఏడు పల్లెలుగా గుర్తించవచ్చును. ఒక మనిషి శరీరములో ఏడు నాడీ కేంద్రములు, ఏడు గ్రంథులు ఉండడము వలన మనిషి జీవితము సాగుచున్నది. నాడీకేంద్రములు శరీరమునకు బలమును అందివ్వగా, ఏడు గ్రంథులు శరీరమునకు ఆరోగ్యమును ఇచ్చుచున్నవి. శక్తికి ఏడు నాడీకేంద్రములు, ఆరోగ్యమునకు ఏడు రస గ్రంథులు శరీరములో నెల కొల్పబడినవి. ఒక ప్రక్క ఏడు నాడీకేంద్రములు, మరొక ప్రక్క ఏడు రసగ్రంథులు, సమానముగా శరీరమును పోషించుచున్నవి. కావున వ్యాపారి ఎక్కడికి పోయినా, ఏడు చీరలు పోయినట్లు వ్రాశాము. అలా వ్రాయడము వలన అన్ని కేంద్రములు, అన్ని గ్రంథులు సమానముగా పని చేయుచున్నవని తెలియుచున్నది.

ఇందుశ్రీ దేశమునకు ఏడవ పట్టణము దేశ రాజధానిగా ఉన్నట్లు మన శరీరమున, ఏడవ నాడీకేంద్రమైన మెదడు ముఖ్య కేంద్రముగా ఉన్నది. అంతేకాక, అష్టమి అను పల్లె, సప్తమి అను పట్టణముకంటే బాగున్నదని చెప్పినట్లు, ఏడు రసగ్రంథులలో గ్రంథి రాజము (పిట్యూటరి గ్లాండ్) అని పేరుగల గ్రంథి, ఏడవ నాడీకేంద్రమువలె, గ్రంథులలో ముఖ్యమైన సారాంశముగా ఉన్నది. ఏడవ నాడీకేంద్రము, ఎనిమిదవ

రాజగ్రంథి తలయందు ఒకే స్థానములో ఉన్నాయి. ప్రపంచములోని సర్వ జీవరాసులను నడిపించు ఆత్మశక్తి, ఏడవనాడీకేంద్రములోనూ, ఎనిమిదవ గ్రంథి రాజములోనూ ఉన్నది. ఆత్మశక్తి సగము సప్తమ కేంద్రములోనూ, సగము అష్టమ గ్రంథిలోనూ ఉండడము చాలామందికి తెలియదు. మొత్తానికి ఆత్మ విషయమే ఎవరికీ తెలియదు. ఏడవ కేంద్రము, ఎనిమిదవ గ్రంథి రెండూ, ఒకే స్థలములో ఉన్నట్లు కూడా ఎవరికీ తెలియదు. గ్రంథి రాజము, తల మధ్యలో ఉన్నదని చెప్పినా, అందులో ఏ శక్తి పని చేయుచున్నదో కూడా ఎవరికీ తెలియదు. ముఖ్యముగా గమనించతగిన విషయమేమనగా! అష్టమ గ్రంథినుండి ఏ రసమూ ఊరదు, దానిలోనున్న ఆత్మశక్తి, అన్ని గ్రంథులకూ, కనిపించని కిరణముల ద్వారా పోవుచున్నది. అలాగే సప్తమ కేంద్రములోనున్న ఆత్మశక్తి, బ్రహ్మనాడి ద్వారా శరీరమంతా ప్రాకుచున్నది. ఆత్మశక్తి ఏడుకేంద్రముల ద్వారా ఎంత ప్రవహించుచున్నదో, దానికి సమానముగా ఆత్మశక్తి, ఏడు గ్రంథుల ద్వారా పోవుచున్నది. అందువలన సామెతలో పట్టణము తిరిగినా ఏడే చీరలు, పల్లె తిరిగినా ఏడే చీరలు అని చెప్పారు. ఈ సామెతలో, పల్లె పట్టణమని రస గ్రంథులను, నాడీకేంద్రములను చెప్పారు. రెండిటియందు సమానముగా శక్తి ఖర్చువుచున్నదని చెప్పుటకు, పల్లెలో ఏడు చీరలు, పట్టణములో ఏడు చీరలన్నారు. శరీరములో ఆత్మ నిలయమును, దాని ఉపయోగమును తెలుపుటకు ఈ సామెతను చెప్పారు. ఈ సామెతను బాగా అర్థము చేసుకొన్నవాడు, పూర్తిగా జ్ఞానము తెలిసి, చతుర్థశి తర్వాత చెప్పబడు పౌర్ణమి కాగలడు.

# 21. నరునికి నాలుగు అంశలు

మనిషి పుట్టిన తర్వాత యుక్తవయస్సు వచ్చువరకు తల్లితండ్రుల మీద ఆధారపడి బ్రతుకుచుండును. తర్వాత స్వయముగా బ్రతుకుటకు మనిషి అలవాటుపడుచున్నాడు. ఒక ఊరిలో ఒక రైతుకు నలుగురు కొడుకులు గలరు. ఆ రైతుకు, ఆస్తి అంతయు నాలుగు (4) ఎకరముల పొలము కలదు. కొడుకులందరూ పెద్దవారైన తర్వాత, తన ఆస్తిని తండ్రి నలుగురు కొడుకులకు పంచి ఇచ్చాడు. ఒక్కొక్కరికి ఒక ఎకరము పొలము వచ్చినది. ముగ్గురు కొడుకులు చదువుకొన్నారు, వారు అమెరికా వెళ్ళి ఉద్యోగము చేయుచున్నారు. అందరికంటే చిన్నవాడు చదువుకోలేదు. కావున ఇండియాలోనే ఉండి, పొలము పనిని చేసుకొంటున్నాడు. నాలుగు ఎకరముల పొలమును నలుగురికీ పంచునపుడు, మొదట ఎకరమును పెద్దవానికి ఇచ్చాడు. తర్వాత ఉండు దానిని రెండవవానికి, ఆ తర్వాత దానిని మూడవ వానికి ఇచ్చి, చివరి ఎకరమును చిన్నవానికి ఇచ్చాడు. నాలుగు ఎకరముల పొలము నాలుగు భాగములుగా విభజింపబడియుండి, అందులో మొదటి భాగము పెద్దవానిదైన దానివలన, చిన్నవాడు దానిని, పెద్దన్న పొలము అనెడివాడు. అలాగే రెండవ భాగమును, నడిపన్న పొలము అని అనెడి వాడు, మూడవ భాగమైన దానిని, చిన్నన్న పొలము అని చెప్పెడివాడు. చివరి ఎకరము, చిన్నవాడైన తనదే కావున ముందున్న భాగమునుండి వరుసగా, మూడు భాగములకు పెద్దన్న, నడిపన్న, చిన్నన్న భాగములని పేర్లుంచుకొన్నాడు. చిన్నవాని పేరు ఉత్తన్న కావున, ఆ ఊరి వారు ఎవరైనా, చిన్నవాని పొలమును ఇది ఉత్తన్న పొలము అనెడివారు. ఈ విధముగా నాలుగు భాగములుగానున్న నాలుగు ఎకరముల పొలము, నాలుగు పేర్లతో పెద్దన్న పొలము, నడిపన్న పొలము, చిన్నన్న పొలము, ఉత్తన్న పొలము అని పిలువబడుచున్నది.

చిన్నవాడైన ఉత్తన్నకు నాలుగు ఎకరముల పొలమును సాగు చేయుటకు సాధ్యము కాలేదు. తన ముగ్గురు అన్నల పొలమును సాగు చేయుటకే తన ఓపిక సరిపోవుచుండెను. ఇంకా కొంత శ్రమపడితే, తన స్వంత పొలమైన చివరి ఎకరమును సాగు చేయవచ్చును. అయితే అతను మూడు భాగములలోనే శ్రమపడుచూ, చివరి భాగములో ఏమాత్రము పని చేయక దానిని బీడుగానే యుంచాడు. ఒక దినము, తనకు తండ్రి తర్వాత తండ్రి అయిన పెదనాన్న వచ్చి, తన స్వంత పొలమును ఎందుకు బీడుగా ఉంచావు? అని అడిగాడు. దానికి ఉత్తన్న సమయము కుదరలేదు, ముగ్గురు అన్నగార్ల పొలములను సాగుచేయుటకే కాలము సరిపోవుచున్నదని సమాధానము చెప్పెను. దానికి, అతని పెదనాన్న అతనిని మందలించి "పూర్తి మీ అన్నగారి పొలములోనే పని చేయుచూ, నీ పొలమును వ్యర్థము చేసుకొన్నావు. మీ అన్నగార్ల పొలములోనే 12 గంటల కాలము గడుపు చున్నావు. ముగ్గురి అన్నల పొలములో ఒక్కొక్క దానిలో నాలుగు గంటలు పని చేయుటకంటే, మూడు గంటలసేపు పని చేస్తే, మూడు గంటలు కాలము మిగులును కదా! ఆ మూడు గంటల కాలము నీవు నీ పొలములో పని చేస్తే, నీ పొలము కూడా సాగవుతుంది. నీ పొలము సాగవడమేకాక పండిన పంట అంతా నీదే అవుతుంది. మీ అన్నల పొలములో పని చేసినా, వచ్చిన ఫలితములో సగము మీ అన్నగారికి ఇస్తే నీకు మిగిలేది సగమేకదా! అట్లు కాకుండా, నీ పొలములోనే నీవు చేసుకొంటే, వచ్చిన ఫలితమంతా నీదే అగును కదా! ఒకవేళ వాటిలో చేసి, నా దానిలో చేయలేను అని నీవు అంటే, ఆ మాటను నేను ఏమాత్రము ఒప్పుకోను. నీకు అంతగా చేతకానప్పుడు మీ అన్నగార్ల పొలములను వదలి, నీ పొలమును మాత్రము చేసుకో. నీ అన్నగార్ల పొలమును నీవు చేయకున్నా, నిన్ను దండించు

వారు ఎవరూ లేరు. మోహగుణములో పడి, నా అన్నలు అను భ్రమలో నీది కాని పొలములో పనిచేసి, నీ పొలమును బీడుగా పెట్టుకొన్నావు. ఇప్పటికైనా మించి పోయినది లేదు. చేతనైతే అన్ని భాగముల పొలములలో పనిచేయి, చేతకాకపోతే వాటిని వదలి నీ దానిని మాత్రము చేసుకో. పెద్దవానిని నేను చెప్పుచున్నాను. కావున నామాటను వింటే బాగుపడగలవు." అని చెప్పాడు.

తన తండ్రికంటే పెద్దవాడైన పెదనాన్న వచ్చి, తన తప్పును చూపి దండించిన తర్వాత, ఆయన చెప్పినట్లు నడువకపోతే బాగుండదని గ్రహించిన ఉత్తన్న, తన పొలములో కూడా పనిచేయుటకు మొదలు పెట్టాడు. తన అన్నగారి పొలములలో కూడా కొంత వరకు పని చేయుచూ, కొంతసేపు తన పొలములో కూడా పనిచేయుటకు ఉత్తన్న అలవాటు చేసుకొన్నాడు. తన అన్నగారి మూడు ఎకరములు చౌడు భూములైన దానివలన, ఎంత కష్టపడినా కొద్దిగా కూడా పంట పండెడిదికాదు. అదే తన పొలము సారవంతమైన దానివలన, కొద్దిసేపు పనిచేసినా పంట బాగా పండెడిది. ఇలా కొన్ని సంవత్సరములు చేయగానే, సారవంతమైన తన నేలలో సాగు చేస్తే ఎంతో పండడమూ, తన ముగ్గురి అన్నగార్ల మూడు ఎకరములలో సాగుచేసినా, ఆ మూడూ సారవంతమైన పొలములు కాకపోయిన దానివలన ఫలితము శూన్యముగా ఉండడమూ, ప్రత్యక్షముగా గ్రహించిన ఉత్తన్న, తాను ఆ మూడు ఎకరములను వదలివేసి, తన పొలములో మాత్రమే పని చేసుకోవడములో ఎంతో లాభమున్నదని తలచి, అప్పటినుండి తన పొలములో పనిని చేస్తూ, పండిన పంటతో లాభమును గడిస్తూ, అతి తక్కువ కాలములోనే కోటీశ్వరుడైపోయెను.

ఇదంతయు చదివిన వారికి కొంత విసుగొచ్చి, నలుగురు అన్న దమ్ములు, నాలుగు ఎకరములు, చౌడు భూమి, సాగుభూమి ఇంత కథ మనకెందుకు? ఇందులో మనము తెలుసుకోవలసిది ఏమైనా ఉన్నదా? అని ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! ఇదంతయు తప్పనిసరిగా మనకు ఎంతో అవసరము. సత్యము చెప్పాలంటే, నీకు ఎంతో అవసరము. ఎందుకనగా! ఇదంతయు నీ కథయే! అర్థము కాలేదా! అయితే అర్థమయ్యేటట్లు చెప్పుతాను విను. దేవుడనే తండ్రి, నీవు పుట్టినపుడే నీకు కొంత కనిపించని పొలమును ఇచ్చాడు. అదియే గుణ చక్రములో ఉన్నది. గుణచక్రములోని తామస భాగము పెద్దన్న పొలము కాగా, రాజస భాగము నడిపన్నదికాగా, సాత్త్విక భాగము చిన్నన్నది. మూడు భాగముల చివరిలో ఉండు భాగము ఉత్తన్నయిన నీది. నీ స్వంత భాగము, మూడు భాగముల తర్వాత ఉండు ఆత్మభాగము లేక యోగ భాగము. నీవు జీవునివి. నీ స్వంత స్థానము ఆత్మ స్థానమైన మూడు గుణభాగముల చివరి స్థానము. నీ స్థానములో ఏమీ ఉండదు. కావున నీ స్థానమును బట్టి ఉత్తన్న అని పేరు పెట్టబడినది. నీవు పుట్టింది మొదలు కథలో నీ పెద్దన్న భాగమని పేరు పెట్టి చెప్పిన తామసములోగానీ, నడిపన్న భాగమని పేరు పెట్టి చెప్పిన రాజసభాగములోగానీ, చిన్నన్న భాగమని పేరుపెట్టి చెప్పిన సాత్త్విక భాగములోగానీ పని చేయుచునే ఉన్నావు. అయితే నీ స్వంత భాగమైన గుణ భాగముల చివరిలోని, నాల్గవ స్థానములోనికి, నీవు ఎప్పుడూ పోలేదు, అక్కడ ఏ పనినీ నీవు చేయలేదు. నీవు పుట్టినప్పటి నుండి కథలోని ఉత్తన్న, తన పొలమును వదలి తన ముగ్గురి అన్నగారి చౌడు భూములలో కష్టపడి పని చేసినట్లు, ఉత్తన్న శ్రమపడినట్లు, నీవు కూడా నీ స్వంత స్థానములు కానటువంటి తామస, రాజస, సాత్త్విక గుణ భాగములలో

అనవసరముగా శ్రమపడుచూ, నీ స్వంత భాగమైన యోగ భాగమును వదలి వేశావు. నీ స్వంత స్థానమును మరచిపోయి, అది ఒకటున్నదని కూడా తెలియని స్థితిలోనికి పోయావు.

ఇటువంటి చెడు స్థితిలోవున్న నిన్ను హెచ్చరించి, రక్షించుటకు, నీ పుట్టు పూర్వోత్తరములు తెలిసినవాడెవడైననావుంటే, అతను మాత్రము వచ్చి చెప్పగలడు. శరీరము లోపల నీ స్థితి ఏమిటో తెలిసినవాడు, నీకు తండ్రి వంటివాడు, తండ్రితో సమానమైనవాడు అయిన గురువు మాత్రము, నీవు ఉండవలసిన స్థితి ఇదియనీ, నీవు ఉంటున్న స్థితి ఇదియనీ చెప్పగలడు. అయితే కథలో ఉత్తన్నకు పెదనాన్న ఉన్నాడు కాబట్టి, వచ్చి ఉత్తన్న బాగుపడుటకు హెచ్చరించి, బుద్ధిచెప్పి, తన పొలములో పని చేసుకొమ్మని చెప్పాడు. ఉత్తన్నకు పెదనాన్న ఉన్నట్లు, నీకూ ఒక పెద్ద తండ్రిలాంటి గురువు ఉంటే, ఆయన నీకు హితము చెప్పి, మూడు గుణములను వదలి ఆత్మ భాగములో చేరి, యోగమును చేసుకొమ్మని చెప్పగలడు. అయితే భూమిమీద పెదనాన్నలు గలవారు కొందరే ఉన్నట్లు, గురువును ఆశ్రయించిన వారు కొందరే ఉన్నారు. కొందరికి గురువులుండినా, ఇది మంచిదీ, ఇది చెడ్డదీ అని చెప్పే స్థితిలో లేరు.

శరీరమును ధరించిన ప్రతి జీవుడు, తలలోని గుణచక్రములో నివాసమున్నాడు. గుణచక్రము, నాలుగు అంశలుగా (భాగములుగా) ఉన్నది. జీవుడు శరీరములో ఉన్నంతవరకు, ఆ నాలుగు భాగములలోనే ఉండవలెను. జీవునికి, గుణచక్రములోని నాలుగు భాగములే నివాసముగా ఉండుట, సామెతలో "నరునికి నాలుగు అంశలు" అని చెప్పారు. నరునికి నాలుగు భాగములని దాని అర్థము. అంశ అనగా భాగము అని అర్థము. తలలోని నాలుగు చక్రముల సముదాయము (Four Wheel Complex) లో

క్రింది చక్రమైన గుణచక్రములో నాలుగు భాగములున్నవి. క్రింది పటములో గుణచక్రములోని నాలుగు భాగములను చూడవచ్చును. అట్లే క్రింద మరొక పటములో శిరస్సులోని నాలుగు చక్రములను చూడవచ్చును.







నాల్గు చక్రముల సముదాయము

కథలో ఉత్తన్న, చౌడు భూములైన మూడు పొలములను వదలి సారవంతమైన తన స్వంత పొలమును సాగు చేసుకొన్నట్లు, ఏ మనిషి అయినా, సారము లేని తామస, రాజస, సాత్త్విక అను మూడు గుణ భాగములను వదలి, మధ్యలో లేక చివరిలోగల గుణరహిత ఆత్మభాగము చేరినవాడు యోగి కాగలడు. యోగి అయినవాడు, కొంత కాలమునకు పూర్తిగా జ్ఞానాగ్ని కలవాడై, కర్మరహితుడైపోయి, మోక్షమును పొందగలడు. మోక్షమును పొందినవాడు, తాను దేవునియందు ఐక్యమైపోయి, ఈశ్వరునిగా మారిపోవును.

## 22. నిత్యము చచ్చేవానికి ఏడ్చేదెవరు?

మనిషియొక్క చావుపుట్టుకలు అందరికీ తెలిసినవే. ఒకమారు పుట్టితే, చావు కొన్ని సంవత్సరముల తర్వాత వచ్చునని అందరూ అనుకోవడము జరుగుచున్నది. పుట్టేది సత్యము, పుట్టినవాడు చచ్చేది సత్యము అని అందరూ అనుకొనుట సహజమే. ఇదే విషయమునే భగవద్గీతయందు సాంఖ్యయోగమున, 27వ శ్లోకములో **"జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్యచ" "పుట్టినవాడు చావక తప్పదు, చచ్చినవాడు పుట్టక తప్పదు"** అని చెప్పబడియున్నది. పుట్టిన తర్వాత చావడమూ, చచ్చిన తర్వాత పుట్టడమూ అనివార్య కార్యమైనదని జ్ఞానులందరికీ తెలుసు. అయితే పుట్టినవాడు ఎప్పుడు చస్తాడు, చచ్చినవాడు ఎప్పుడు పుట్టుతాడు అను నియమమును మాత్రము చెప్పలేదు. మనకు తెలిసిన జ్ఞానము ప్రకారము ప్రారబ్ధకర్మ అయిపోయినపుడు, మరణము సంభవించుననీ, అలా మరణించినవాడు పాత శరీరమును వదలిపోయి, తిరిగి జన్మించినపుడు క్రొత్త శరీరమును ధరించి, క్రొత్త ప్రారబ్ధకర్మతో పుట్టునని తెలుసుకొన్నాము.

ఇటువంటి చావులు, పుట్టుకలు జరుగుచుండడము, అందరికీ ప్రత్యక్షముగా తెలిసిన విషయమే. ఇలా అందరికీ తెలిసిన చావుపుట్టుకల వలన, పాత శరీరము పోయి క్రొత్త శరీరము వచ్చుచున్నది. అందువలన మనము ఇంతవరకు చూచిన మరణములన్నియు జీవునికా? శరీరమునకా? అని ప్రశ్నించుకొని చూచినపుడు, దీనికి జవాబును వెదకడము కొంచెము కష్టమే అయినా, ఈ మరణములన్నియూ శరీరము మార్పునకేనని చెప్పవచ్చును. శరీరము ప్రారబ్ధకర్మ వలన ఏర్పడుచున్నది. కావున శరీర మరణము సంభవించునపుడు ప్రారబ్ధము కూడా క్రొత్తది వస్తున్నది. అందరికీ తెలియునది శరీర మరణము, అందువలన మరణించినవాని శరీరమును చూచి ఏడ్చుచున్నారు. మరణములో జీవుడు, క్షణాల మీద శరీరము మారుచున్నాడు. అంతేగానీ జీవునిలో ఏ మార్పూ లేదు. కేవలము శరీరము కర్మలోనే మార్పు జరుగుచున్నది. జీవుడు మరణములోనూ ఉన్నాడు, జన్మలోనూ ఉన్నాడు. మరణములో ఉన్న శరీరము మాత్రము జననములో ఉండదు. ఇది మరణము యొక్క విషయము. మరణ విషయము పూర్తిగా తెలియాలంటే **"మరణ రహస్యము"** అను గ్రంథమును చదవండి. మరణము కొన్ని సంవత్సరములకొకమారు జరుగుచుండును, నిత్యము జరుగదు.

నిత్యము మరణములాంటిది మరొకటి కలదు. అది మరణము లాంటిదేగానీ మరణముకాదు. భగవద్గీతలో ప్రళయము అను ఒక మాట కలదు. ప్రళయములో జీవుడు లేకుండా పోవుచున్నాడు. జీవుడు ఒక్కడే కాదు సృష్టిలో ఏదైతే ఉన్నదో, అదంతా లేకుండా పోవడమును ప్రళయము అంటున్నాము. ఇప్పుడు ప్రళయమును గురించి అవసరమైన విషయమును మాత్రమే ప్రస్తావింతును. ఒకవేళ మీకు ప్రళయమును గురించిన పూర్తి సమాచారము కావాలంటే, **"కలియుగము ఎప్పటికీ యుగాంతము**

**కాదు"** అను గ్రంథమును చదవండి. ప్రళయములో జీవుడూ, ప్రపంచమూ, అన్నియూ లేకుండా పోయి, తర్వాత కొంత కాలమునకు ప్రభవము జరుగుచున్నది. ఈ విషయమును గూర్చి భగవద్గీతలో అక్షర పరబ్రహ్మ యోగమందు 19వ శ్లోకమున చెప్పారు.

శ్లో॥ భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వాప్రలీయతే ।
రాత్ర్యాగమే వశః పార్థ! ప్రభవ త్యహరాగమే ॥

**భావము :-** సకల జీవరాసులు పగలు జీవించుచున్నవి, రాత్రి అయిన వెంటనే ప్రళయమును పొందుచున్నవి. తిరిగి పగలైన వెంటనే ప్రభవమును పొందుచున్నవి. ఈ విధముగా సకల జీవరాసులు ప్రళయ, ప్రభవములను పొందుచున్నవి. ఇట్లు రాత్రి, పగళ్ళు ప్రళయమునూ, ప్రభవమునూ కర్మ వశమున సకల జీవరాసులు నిత్యము పొందుచున్నవి.

ప్రళయమును పొందిన జీవుడు మరణించి, ప్రభవములో పుట్టినట్లు లెక్కించుకొనినా, ప్రళయములో శరీరము పోదు, ప్రభవములో క్రొత్త శరీరము రాదు. ప్రతి దినము నిద్రపోవడమును ప్రళయము పొందినట్లు లెక్కించు చున్నాము. మనిషి నిద్ర చావులాంటిది. అలాగే మెలకువ పుట్టుకలాంటిది. ఆ లెక్క ప్రకారము ఒక విధముగా జీవుడు నిత్యము చచ్చినట్లే చెప్పవచ్చును. నిత్యము జీవుడు నిద్రలోనికి పోవడమే, నిత్యము చచ్చినట్లని చెప్పవచ్చును. ఒక పుస్తకమును ఆసక్తిగా చదువునపుడు, ఆ పుస్తకములోని విషయములను బుద్ధి బాగా గ్రహించుచున్నపుడు నిద్రవస్తే, మనిషి పుస్తకమును చదువ లేడు. అప్పుడు బుద్ధి విషయమును గ్రహించవలెనని చూచినా, నిద్ర రావడము వలన, బుద్ధికి తీవ్ర ఆటంకము ఏర్పడును. వాహనమును నడుపునప్పుడు నిద్ర వచ్చినా, పుస్తకమును చదువుచున్నప్పుడు నిద్ర వచ్చినా,

సినిమా చూచునప్పుడు నిద్రవచ్చినా, దానిని గురించి చింతించునది, బాధ పడునది బుద్ధి. అందువలన నిత్యము చచ్చువానికి ఏడ్చేది ఎవరు? అను ప్రశ్నకు, శరీరములోని బుద్ధి అని జవాబు చెప్పవచ్చును.

## 23. అయిపోయిన పెళ్ళికి, మేళము ఎందుకు?

ఒక మనిషి దేవునిలోనికి ఐక్యము కావాలంటే, ఒక మనిషి ముక్తి పొందాలంటే, ప్రత్యేకించి ఒక కాలములోనే అది జరుగును. సర్వ కర్మలన్నీ లేకుండా పోయి, కర్మరహితుడైనప్పుడు, మనిషి మోక్షమును పొందవచ్చును. మోక్షము అనగా తిరిగి పుట్టుక ఉండని స్థితి. ఆ స్థితి రావాలంటే ఎప్పటికీ పుట్టని దేవునిలోనికి ఐక్యము కావలసివుంటుంది. అలా దేవునిలోనికి ఐక్యము కావాలంటే, దానికి ప్రత్యేకమైన కాలము ఒకటి కలదు. ఆ ప్రత్యేకమైన కాలములోనే చనిపోయినవాడు, తిరిగి పుట్టకుండా అవ్యయుడైన దేవుని యందు కలిసిపోగలడు. ఒకవేళ ఆ కాలములో ఎవడు చనిపోయినా, వానికి మోక్షము లభించునా అని ప్రశ్నించుకొని చూస్తే, అలా వీలుపడదని తెలియుచున్నది. ఆ కాల నియమము ఒక్క యోగులకు తప్ప మిగతా ఎవరికీ వర్తించదు. అదే విషయమును భగవద్గీతలో, అక్షర పర బ్రహ్మ యోగమున 23వ శ్లోకములో చెప్పారు.

శ్లో॥ యత్రకాలే త్వనా వృత్తి మావృత్తిం చైవ యోగినః ।
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్ష భ! ॥

**భావము :-** "యోగులు ఎప్పుడు మరణిస్తే తిరిగి పుట్టరో, ఎప్పుడు మరణిస్తే మరల జన్మింతురో, ఆ కాలమును గురించి చెప్పెదను విను". ఈ శ్లోకములో యోగినః అని అనుట వలన, ఇది యోగులకు మాత్రమే అని తెలియు

చున్నది. యోగిగానున్నవాడు ఎప్పుడు చనిపోతే, దేవునియందు కలిసిపోయి తిరిగి పుట్టడో, ఎప్పుడు చనిపోతే దేవునియందు ఐక్యము కాకుండా తిరిగి పుట్టునో, ఆ రెండు కాలములను గురించి, గీతలో భగవంతుడు ఏమి చెప్పుచున్నాడో పరిశీలించి చూస్తాము.

24.శ్లో॥ అగ్నిర్జ్యోతి రహః శుక్లష్షణ్మాసా ఉత్తరాయణమ్ ।
తత్రప్రయాతాగచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥

**భావము :-** సూర్యరశ్మిగల పగటియందు, చంద్రుడు శుక్లపక్షమున ఉన్నప్పుడు, సూర్యుడు ఉత్తరాయణములో ఉన్నప్పుడు, మరణించిన యోగులు దేవునియందైక్యమై పోయి తిరిగి పుట్టరు.

25.శ్లో॥ ధూమో రాత్రి స్తథాకృష్ణష్షణ్మాసా దక్షిణాయనమ్ ।
త్రత చాంద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే ॥

**భావము :-** మేఘము ఆవహించి ఉన్నపుడుగానీ, రాత్రిపూటగానీ, చంద్రుడు కృష్ణపక్షమున ఉన్న పదిహేను రోజులలోగానీ, సూర్యుడు దక్షిణా యనమునవున్న ఆరు నెలలలోగానీ, యోగి మరణిస్తే అతడు చంద్ర తేజమును పొంది తిరిగి పుట్టును.

భూమిమీద పుట్టినవాడు ఎవడైనాగానీ, దేవునియందైక్యమైపోయి, తిరిగి జన్మలు పొందని స్థితికి వచ్చుటకు, వాడు తపస్సులు చేయు తపస్వి అయినా, వేదముల చదువు వేదాంతి అయినా, యజ్ఞములు చేయువాడైనా, దానములను చేయువాడైనా అర్హుడు కాడు. దేవునియందు ఐక్యమై తిరిగి జన్మించకుండుటకు యోగి మాత్రమే అర్హుడు. యోగి అయినవాడు కూడా రాత్రిపూటనో, మేఘమున్న పగటిపూటనో, కృష్ణపక్షముననో, దక్షిణా

యనముననో మరణించి తిరిగి జన్మకు పోవుచుండును. దానికి కారణము ఆ యోగికి కర్మలు పూర్తిగా అయిపోలేదని అర్థము. కర్మ శేషమున్న యోగి, దేవునియందైక్యమగుటకు వీలుపడదు. అందువలన కాలము తప్పి పోయి, జ్ఞాన తేజస్సుతో యోగి తిరిగి పుట్టును. తర్వాత జన్మలో కూడా ఆయన యోగిగానే ఉండి, కర్మలన్నిటినీ కాల్చివేసి, దేవునియందైక్యమగు కాలములోనే చనిపోయి మోక్షమును పొందును. యోగి అయినవాడు కర్మశేషమును బట్టి, రెండు మూడు జన్మలకైనా, కర్మరహితుడై, సూర్యరశ్మి గల పగటియందు, శుక్లపక్షమున, ఉత్తరాయణమున చనిపోయి మోక్షము పొంది దేవునిలో కలిసిపోవును. ఇది, మనిషి యోగిగా మారి దేవునియందై క్యమగు విధానము. ఈ విధానము కాకుండా, పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణము కాకుండా, యోగిగా మారకుండా మోక్షమును పొందుటకు వీలులేదు. భారతయుద్ధమున, భీష్ముడు కృష్ణున్ని మోక్షము ప్రసాదించమని కోరగా, కృష్ణుడు ఉత్తరాయణము వచ్చేంతవరకు ఆగమన్నాడు. అప్పటికి ఉత్తరాయణము వచ్చుటకు ఎనిమిది రోజులు కొదువ ఉండుట వలన భీష్ముడు ఎనిమిది రోజులు అలాగే ఉండి, ఎనిమిది రోజుల తర్వాత ఉత్తరా యణము వచ్చిన వెంటనే పగలు, శుక్లపక్షమున చనిపోవడము వలన దేవునియందైక్యమైపోయాడు. యోగికానివాడు స్వామిగానీ, తపస్విగానీ, పీఠాధిపతిగానీ మోక్షము యొక్క అంచుకు పోయేదానికి కూడా వీలులేదు. నేటికాలములో, గురు ఉపదేశము పొందినంతమాత్రముననే మోక్షము పొందియున్నామనడము, సన్యాసత్వము తీసుకొంటూనే మోక్షమునకు టికెట్ దొరికిందనడము సరికాదు. మోక్షము సులభముగా దొరకదు.

బ్రహ్మవిద్యలో పెళ్లి అనగా దేవుడు అని అర్థము. పెళ్ళికూతురు అనగా దేవుని కూతురు అనియూ, పెళ్ళి కొడుకు అంటే దేవుని కొడుకు

అనియూ చెప్పవచ్చును. దేవునియందైక్యమైపోయిన వానిని పెళ్ళైపోయిన వాడని కూడా చెప్పవచ్చును. దేవున్ని పెళ్ళి అంటే, దేవునిలో చేరిపోయిన వారందరినీ పెళ్ళైయినవారని అనవచ్చును. దేవుడు ధర్మ సంస్థాపన నిమిత్తము, మనిషిగా భూమిమీద పుట్టినప్పుడు, భగవంతునిగా లెక్కించ బడును. భగవంతుడే గురువుగా ఉండును. గురువుగా ఉండినవాడు ఎల్లప్పుడు కర్మయోగిగానే ఉండును. కర్మయోగి అయిన గురువు చని పోయినప్పుడు, ఆయన తిరిగి మొదటి స్థానమైన దేవునియందే చేరిపోవలసి యున్నది. అలా యోగియైన గురువు దేవునియందు చేరుటకు అవసాన దశలో ఏ యోగి అయినా దేవునియందు కలియుటకు నిర్ణయించబడిన ప్రత్యేకమైన కాలములోనే, చనిపోవలెనా అని కొందరికి ప్రశ్న రాగలదు. మనిషైనవాడు ఎవడైనా, వాడు దేవునియందైక్యమగుటకు కాలనియమ మున్నపుడు, ఆ నియమము మనిషిగా పుట్టిన భగవంతునికి కూడా వర్తించును కదా! అని అనుకొంటే మనము పప్పులో కాలు వేసినట్లగును. పెళ్ళి కాని వానికి తాళి అవసరము, మేళమూ అవసరము. పెళ్ళైయినవానికి మళ్లీ పెళ్ళి అవసరములేదు కదా! అలాగే ఒకమారు దేవుడైనవాడు తిరిగి దేవుడు కావలసిన అవసరములేదు. దేవుడు భూమిమీదికి సాధారణ మనిషిగా వచ్చినా, ఆయనను భగవంతుడు అనీ, గురువు అనీ చెప్పవచ్చును. భగవంతుడంటే మానవ రూపములోనున్న దేవుడని అర్థము. అలాగే గురువు అనినా మనిషిగానున్న దేవుడనియే చెప్పవచ్చును. దేవుడు దేవునిగానే ఉన్నప్పుడు, తిరిగి దేవునిగా మారుననుటలో అర్థములేదు. సాధారణ మనుషులకు దేవుడు చెప్పిన సూత్రము కాల నియమము. దేవుడు మనుషులకు చెప్పిన సూత్రమును, మనుషులు దేవుని మీద ప్రయోగించ కూడదు. పెళ్ళికాని వానికి చెప్పిన సూత్రమును పెళ్ళి అయిన వానికి

ఉపయోగించకూడదు. అందువలన మన పెద్దలు "అయిపోయిన పెళ్ళికి మేళమెందుకు" అను సామెతను ఉపయోగించి, దేవునిలోనికి ఐక్యమైన వానికి కాల నియమమెందుకు అన్నట్లు చెప్పారు.

## 24. నా పాతివ్రత్యము, నా మొదటి మొగునికి తెలుసు

పతివ్రత అనగా పతియే వ్రతముగా గలది అని అర్థము. ఒక విధముగా చెప్పుకొంటే పతిమీద చూపు తప్ప, ప్రక్క చూపులేనిదని చెప్ప వచ్చును. పతి అనగా భర్త లేక మొగుడు అని అర్థము. ఒకే భర్త సాంగత్యము తప్ప, ఇతర పురుషుల సాంగత్యములేని స్త్రీని పతివ్రత అని అనుచుందురు. ఒక స్త్రీకి ఇద్దరు భర్తలున్నప్పుడు, ఆమెను పతివ్రత అనుటకు వీలులేదు. పై సామెతలో నా పాతివ్రత్యము నా మొదటి మొగునికి తెలుసు అన్నప్పుడు రెండవ మొగుడు అమెకున్నాడని చెప్పకనే తెలియుచున్నది. రెండవ మొగుడు ఉన్నప్పుడు ఆమె పతివ్రతయా కాదా అని, మొదటి మొగున్ని అడుగవలసిన పనియే ఉండదు. అటువంటపుడు ఈ సామెతను విన్నవారెవరైనా, కనిపిస్తుంటే తొంగి చూడవలసిన అవసరము లేదు అన్నట్లు, రెండవ భర్తవున్న ఆమె పతివ్రత కాదని తెలిసిపోవుచున్నదని చెప్పగలరు. అటువంటపుడు ఈ సామెతను చెప్పవలసిన అవసరమేమి వచ్చినదని చూచితే, అందరికీ తెలియని వివరము మనకు కొంత బోధ పడగలదు.

జగతికంతా దేవుడు భర్తయైనప్పుడు, దేవున్ని జగద్భర్త అని చెప్పి నపుడు, పుట్టుకతోనే దేవుడు అందరికీ భర్తయై ఉన్నాడు. ఒక స్త్రీకి పుట్టుక తోనే దేవుడు భర్తకాగా, యుక్తవయస్సులో వివాహమైనప్పుడు వచ్చినవాడు రెండవ భర్త అగును. ఒక స్త్రీకి మొదట భర్త ఉన్నాడని తెలిసినా తెలియక

పోయినా ఆమెకు భర్త ఉన్నట్లుగానే మనము లెక్కించుకోవలెను. ఆమె తన రెండవ భర్తను గుర్తించి అతనికి కాపురము చేసినా, మనస్సులో మొదటి భర్తను గురించి యోచించని దానివలన ఆమెను కులట క్రిందికి జమకట్టవచ్చును. పుట్టుకతోనే భర్తగానున్న దేవున్ని విస్మరించి, శరీర భర్తతో కాపురము చేయుచూ, శరీర భర్తయొక్క మాటలు విని, మానసిక భర్తయైన దేవున్ని తక్కువగా చూచిన స్త్రీ, మొదటి భర్తకు మోసము చేసిన స్త్రీ అగును. ఏ విషయములోనైనా రెండవ భర్త మాటవినినా ఫరవాలేదు. కానీ మొదటి భర్త అయిన దేవుని విషయములో, శరీర భర్త చెప్పినట్లు వినకుండా, మొదటి భర్త ఎడల ఎట్లుండవలెనో అట్లుండు స్త్రీ నిజమైన పతివ్రతయగును. ఒక స్త్రీకి గల ఇద్దరు భర్తలలో, మొదటి భర్తయే నిజమైన భర్త అగును. రెండవ భర్త నిజమైన భర్తకాడు. ఎందుకనగా అతనికి కూడా భర్త ఉన్నాడు. తనకు భర్తయున్న వ్యక్తి, ఇంకొకరికి భర్త ఎలా కాగలడు. అతను భర్త అని చెప్పబడినా, వాస్తవానికి అందరికీ మొదటి వాడే భర్త. మొదటి భర్త ఎడల విశ్వాసముతో మెలగు భార్య ఎటువంటిదని మొదటి భర్తకే తెలుసు. అందువలన ఈ సామెతలో "నా పాతివ్రత్యము నా మొదటి మొగునికి తెలుసు" అని అన్నారు.

## 25. భూతాలకు బుద్ధిలేదు, నరులకు బద్ధం లేదు

విశ్వమును దేవుడు సృష్ఠించినప్పుడే తన పరిపాలనను కూడా తయారు చేశాడు. దానితో దేవుడు సృష్ఠించిన విశ్వము, పాలించు వారూ, పాలించబడువారు అను రెండు రకముల జీవరాసులతో నిండిపోయినది. పాలించబడువారు మనకు ప్రత్యక్షముగా కనిపించు జీవరాసులుగా ఉండగా, పాలించువారు కనిపించని గ్రహములు, ఉపగ్రహములుగా మరియు

భూతములూ, ఉప భూతములుగా ఉన్నారు. పాలించబడు జీవరాసులు అండజ, పిండజ, ఉద్భిజములుగా ఉన్నవి. భూమండలములో ఎన్నో కోట్ల జీవరాసులుండగా, వాటిని పాలించు గ్రహములు, భూతములు కోట్ల కొలది ఉన్నవి. జీవరాసులను నడిపించి, అనుభవింపజేయుటకు కారణమైన కర్మయున్నది. బయట ప్రపంచములో కొన్ని కర్మలను జీవుడు అనుభవించు టకు, కనిపించకుండా కొన్ని కార్యములను చేసి, ఆ కార్యముల వలన జీవులను అనుభవింపజేయునట్లు, గ్రహములు, భూతములు చేయు చుండును. కర్మను అనుభవించు జీవులన్నియూ మాయ మాత ఆధీనములో ఉండగా, అనుభవింపజేయు గ్రహ, భూత జీవులన్నియూ ప్రకృతి ఆధీనములో ఉండును. ప్రకృతియంతయూ, దేవుని ఆధీనములో ఉండును.

మనుషులకు మనస్సు, బుద్ధి, చిత్తము, అహము అను నాలుగు భాగములు శరీరములో ఉండును. ముఖ్యముగా ఈ నాలుగు అంతఃకరణ ములు మనిషిని పూర్తిగా తప్పుదారి పట్టిస్తున్నాయి. అందువలన దేవుని జ్ఞానమునకు బద్ధుడై బ్రతకడము లేదు. శరీరములో ఈ నాలుగు అంతఃకరణ ములు పని చేయడము వలన, మనిషి దేవుని జ్ఞానమునకు బద్ధుడైగానీ, పెద్దలమాటకు బద్ధుడైగానీ, ధర్మములకు బద్ధుడైగానీ ఉండడము లేదు. అందువలన మనిషి జ్ఞానబద్ధుడు కాడు అనుమాట అందరికీ తెలిసిపోయి నది. ఎక్కడైనా అరుదుగా వేయింటికి ఒక్కడు, జ్ఞాన ధర్మబద్ధుడైయుంటే వానిని హేళనగా మాట్లాడువారు 999 మంది ఉందురు. మనిషి మాయ బద్ధుడై, జ్ఞానబద్ధుడు కాకపోయాడు. అందువలన మనిషిని బద్ధం లేనివాడు అని మన పెద్దలన్నారు. మానవజాతి అంతయు మిగతా జీవరాసులకంటే ఎక్కువ అజ్ఞానమార్గములో కూరుకొని పోయివున్నది. అలా ఉండుట వలన పాలింపబడు జీవులలో, మానవుడు మాత్రమే జ్ఞానబద్ధములేని వాడైపోయి

పైకి కనిపిస్తున్నాడు. దేవుని పరిపాలనా భాగములోని భూతములు మరియు గ్రహములు, ఎక్కువగా మానవుని మీద దృష్టి పెట్టాయి.

పరిపాలన అంటే శిక్షలు విధించుటకే నెలకొల్పినదని అర్థము. ఎవరైతే ఒక బద్ధత లేకుండా తమ ఇష్టమొచ్చినట్లు నడుచుకొనుచూ, రాజునే ధిక్కరించు స్వభావము కల్గియుందురో, అప్పుడు రాజ్యాంగ చట్టము వారిమీద చర్య తీసుకొనును. రాజ్యాంగ చట్టములో ఫలానా తప్పుకు ఫలానా శిక్షయని ముందే నిర్ణయించబడియుండును. అందువలన పాలించువారు శిక్షించు వారేగానీ, శిక్ష విషయములో నిర్ణయము తీసుకొనువారు కాదు. తప్పులకు శిక్షలు ముందే నిర్ణయింపబడియుండుట వలన, మనుషులను పాలించు భూతములు, గ్రహములు శిక్షల విషయములో యోచించవలసిన పనిలేదు. నిర్ణయించబడిన శిక్షలను అమలుచేసి, శిక్షించడమే తమ పనిగా పెట్టుకొని యుందురు. దేవుని పరిపాలన విభాగములోని భూతములకు, గ్రహములకు పాలింపబడు మానవులకు ఉన్నట్లు మనస్సు, బుద్ధి, చిత్తము, అహము ఉండవు. వారికి కర్మవుండడముగానీ, కర్మరావడముగానీ, కర్మ అయి పోవడము గానీ ఉండదు. మనిషి, కర్మ ప్రకారమే ఆడుచూ, కర్మ ప్రకారమే అనుభవిస్తున్నాడు. అయితే భూతములు, గ్రహములు పరమాత్మ నెలకొల్పిన ప్రకృతి చట్టము ప్రకారము నడుస్తున్నాయి. ప్రకృతి చూపిన దేవుని ఆజ్ఞల ప్రకారము పాలన సాగించుచున్నవి.

భూమిమీద జీవరాసులైనవారు మనుషులేకాక దేవతలు కూడా ఉన్నారు. దేవతలుగానీ, ఋషులుగానీ, రాజుగానీ ఎవరైనాగానీ జీవరాసి అయినవారందరినీ శిక్షించు అధికారము భూతములకు, గ్రహములకు ఉన్నది. వీరు ఎవరు అను విచక్షణ, గ్రహములకు, భూతములకు

ఉండదు. వారు ఎవరిని గురించీ ఆలోచించరు. ఎందుకనగా పరిపాలన విభాగములోనున్న భూతములకు, గ్రహములకు బుద్ధియుండదు. అహము ఉండదు. మిగతా అంతఃకరణములు ఏవీ ఉండవు. అందువలన సంపూర్ణ జ్ఞానము తెలిసిన మన పెద్దలు, సామెతగా "భూతాలకు బుద్ధిలేదు, నరులకు బద్ధం లేదు" అని అన్నారు. నేటి కాలములో డబ్బు సంపాదనవైపు తప్ప ప్రక్కకు చూడని మనిషిని, ప్రయాణములోను, పనులలోనూ భూతములు గ్రహములు ప్రమాదముల రూపములో ఘోరముగా శిక్షించుచున్నవి. అంతేకాక రోగముల రూపములో కఠినాతి కఠినముగా శిక్షించుచున్నవి. ఎన్నో ఊహించని విధానములలో శిక్షించుచున్నవి. భూతములు విధించు అన్ని శిక్షలను అనుభవిస్తున్న మనిషి, తన శిక్షల వెనుక ఏ శక్తులు పని చేయుచున్నవని కొద్దిగైనా ఆలోచించడములేదు. ఇట్లు బద్ధం లేని నరున్ని బుద్ధిలేని భూతములు, గ్రహములు శిక్షించుచున్నవని ఇప్పటికైనా తెలుసు కోండి.

## 26. మధ్వులకు భుక్తి, వైష్ణవులకు భక్తి, అద్వైతులకు యుక్తి, త్రైతులకు శక్తి

ఈ సామెతను సామెతల గ్రంథమునుండి తీసుకొన్నాము. అయితే ఈ సామెత చివరిలో త్రైతులకు శక్తి అను పదమును మేము చేర్చాము. సామెతల గ్రంథములో అద్వైతులకు యుక్తి, అన్నవరకేయున్నదని తెలుపుచున్నాము. గ్రంథములోయున్న సామెత "మధ్వులకు భుక్తి, వైష్ణవులకు భక్తి, అద్వైతులకు యుక్తి" అని ఉన్నది. ఈ మూడూ, ఆధ్మాత్మిక విద్యలో సిద్ధాంతములుగా ఉన్నవి. ఆధ్యాత్మికములో ముఖ్యముగా ఉండవలసినది శక్తి. అయితే ఈ సామెతను వ్రాసినవారు భుక్తి, భక్తి, యుక్తి వరకు వ్రాసి

యుంచారు. ఒక విధముగా రాబోయే నాల్గవ సిద్ధాంతము కొరకు “శక్తి” పదమును వదలివేశారేమో అనిపిస్తున్నది. అందువలన ఇప్పుడు ఈ సామెతకు **“త్రైతులకు శక్తి”** అను వాక్యమును మేము జోడించామని అందరికీ తెలుపుచున్నాము. అంతేకాకుండా ఇంకా ఇక్కడ తెలుపు వాస్తవ విషయము ఒకటున్నది, అదేమనగా!

ఆధ్యాత్మిక విద్యలో స్థూల, సూక్ష్మములు రెండూ ఉంటాయి. రెండిటినీ తెలిసినవాడే ఆధ్యాత్మికవేత్త కాగలడు. స్థూల, సూక్ష్మములను తెలియనివాడు ఎంత గొప్పగా పిలువబడుచున్నా, బ్రహ్మర్షి అని పేరు పెట్టుకొనినా అతను మాత్రము బేవర్షియే అగును. అలాగే భగవాన్ అను పదమును తన పేరు ముందు ఉంచుకొనినా అతను మాత్రము సైతాన్‌గానే లెక్కించబడును. మనిషి స్థోమతను గుర్తించగలుగు జ్ఞానము, స్థూల, సూక్ష్మముల జ్ఞానము. అందువలన ప్రతి ఆధ్యాత్మికవేత్త స్థూలమును తెలిసినట్లు, సూక్ష్మమును తెలిసివుండాలి. మనిషి శరీరము స్థూలము. మనిషి శరీరములోని జీవుడు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహము సూక్ష్మము. ఒక మనిషిలో ముఖ్యపాత్ర పోషించునవి మనస్సు, బుద్ధి, అహము. స్థూలశరీరము అందరికీ ఒకే పాత్ర పోషించుచున్నది. అయితే ఒక్కొక్కని బుద్ధి ఒక్కొక్క విధముగా ప్రత్యేకత కల్గియున్నది. కావున స్థూల శరీరముకంటే, సూక్ష్మశరీరమే ముఖ్యమని తెలియుచున్నది. శరీరము తొమ్మిది రంధ్రములు గల పుట్టలాంటిది. పుట్టలో నివసించు పాములాంటివాడు జీవుడు. జీవుడు సంపాదించుకొన్న జ్ఞానమును, చేసుకొన్న యోగమును బట్టి అతనికి జ్ఞానశక్తి ఉండును. జ్ఞానశక్తినే జ్ఞానాగ్ని అని భగవద్గీతలో కూడా చెప్పారు. జ్ఞానాగ్ని సూక్ష్మమైనది. అది ఎవరికీ కనిపించదు. దానికి కర్మలు కాల్చు విధానమున్నది. కావున అనుభవించు కర్మ కాలిపోయినప్పుడు, జ్ఞానాగ్ని యొక్క ఉనికి తెలియుచున్నది.

ఇప్పుడు అసలు విషయములోనికి వస్తాము. అద్వైత సిద్ధాంతమును శంకరాచార్యులు ప్రతిపాదించాడు. విశిష్టాద్వైతమును రామానుజాచార్యులు ప్రతిపాదించాడు. ఇప్పుడు మేము త్రైత సిద్ధాంతమును ప్రతిపాదించాము. సామెతలో, వైష్ణవులది భక్తి, అద్వైతులది యుక్తి అని వ్రాశారు. అయితే వారికేమున్నదో మాకు తెలియదుగానీ, మాకు శక్తియున్నదని తెలియుట వలన త్రైతులది శక్తి అని వ్రాశాము. ఇప్పుడు కొందరు "మీది శక్తి అని ఎలా చెప్పగలుగుచున్నారు?" అని ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఈ విధముగా కలదు. చిన్న జపమాలలో 54 పూసలున్నట్లు మా గ్రంథమాలలో 54 గ్రంథములుండవలెనని తలచి, ఇప్పటికి 40 గ్రంథముల వరకు వ్రాయడము జరిగినది. మాచే వ్రాయబడిన ప్రతి గ్రంథము సజీవముగా తయారైనది. గ్రంథములో జీవముండడమేకాక, ఆ జీవునకు శక్తి కూడా ఉండడము జరిగినది. గ్రంథములలోని జీవము కర్మలున్న జీవముగాకుండా, కర్మలులేని భూతముల, గ్రహములలోనిదనుకొనుము. గ్రంథములలో భూతముల జీవముండుట వలన, నేను గ్రంథములను ఉద్దేశించి చెప్పునపుడు అవి నాకు కొడుకులులాంటివని చెప్పడము కూడా జరిగినది. ఇప్పుడున్న 40 గ్రంథ కొడుకులలో అందరూ శక్తికలవారై యుండడమేకాక, కొందరు కొంత ప్రభావమును బయటికి చూపుచూ తమ పేరు బయటికి వచ్చునట్లు చేసుకొన్నారు. ఉదాహరణకు చెప్పితే **"మంత్రము-మహిమ"** అను 48 పేజీల చిన్న గ్రంథము, తేలు విషముతో బాధపడు వారి బాధను తనశక్తితో ఒక్కటి లేక రెండు నిమిషములో లేకుండా చేయుచున్నది. తల నొప్పియున్నవాని కర్మను గ్రంథము మీద విశ్వాసముతో గ్రంథమునకు నమస్కరించి తలమీద పెట్టుకుంటూనే, వాని నొప్పి మాయమగునట్లు చేయుచున్నది. ఇదంతయూ ప్రత్యక్ష ప్రమాణముగా

తెలియుట వలన, ఆ చిన్న గ్రంథములో శక్తియున్నట్లు తెలియుచున్నది. ఇదే విధముగా **"దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు"** అను గ్రంథము, **"సత్యాన్వేషి"** అను గ్రంథము తమ సామర్థ్యమును తీక్షణముగా బయటికి కనబరుస్తున్నవి. మాచే వ్రాయబడిన అన్ని గ్రంథములలోనూ భూతములను జీవుడు ఉండడమేకాక, ఆ జీవునికి శక్తి కూడా యున్నట్లు తెలియుచున్నది. మిగతా వారు వ్రాసిన గ్రంథములలో అటువంటి శక్తి లేదు మరియు జీవమూ లేదు. అందువలన అవి వస్తువులతో సమానమే. ఇక్కడ తయారైన **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** అను గ్రంథములోని జీవము చాలా ఓపికగలవాడుయే గాక, చాలా శక్తివంతమైనవాడు. తనను దూషించిన వారిని నెమ్మదిగా భూమిమీద లేకుండా చేశాడు. మిగతా కొన్ని గ్రంథములు తమను చులకనగా చూచినవారిని చాలా కష్టములపాలు చేశాయి. ఇవన్నిటినీ గమనించిన మేము, అసంపూర్ణముగానున్న సామెతను త్రైతులది శక్తి అని పూరించి వ్రాశాము.

## 27. సుతులు లేని వానికి గతులు లేవు

సుతులు అనగా కొడుకులు అని అర్థము. కొడుకులు లేనివానికి మోక్షమురాదు అని చెప్పుటకు "సుతులు లేనివానికి గతులు లేవు" అను సామెతను చెప్పారు. ఈ సామెత ప్రకారము పోతే ఎవరూ మోక్షమును పొందుటకు అవకాశమే లేదని తెలియుచున్నది. ఎందుకనగా! భూమిమీద పురుషుడు, దేవుడు ఒక్కడే అని బ్రహ్మవిద్య చెప్పుచున్నది. రాజస్థాన్ చరిత్రలోని మీరాబాయి, కృష్ణుడు తప్ప లోకములో పురుషులు ఎవ్వరూ లేరని చెప్పింది. అంతేకాక భగవద్గీతలో గుణత్రయ విభాగయోగమను అధ్యాయములో 3,4 శ్లోకములయందు దేవుడు ఒక్కడే పురుషుడనీ, ఆయన

బీజము వలననే సమస్త మానవాళి పుట్టుచున్నదనీ, అందరికీ తండ్రి దేవుడే నని చెప్పబడినది. అలాంటపుడు మనుషులు అందరూ పురుషత్వము లేని వారేనని తెలియుచున్నది. మనుషులు పేరుకు పురుషులైనా, మనుషుల బీజము వలన ఎవరూ పుట్టలేదని తెలియుచున్నది. ఇది కొంత విచిత్రమైన మాటయే అయినా, మనుషులనందరినీ ఆలోచింపచేసే విషయమిది. మనిషిగానున్న జీవుడు, మనిషి శరీరములో ఒక భాగముగా ఉన్నాడు. అటువంటపుడు జీవుడు తనను గురించి తాను ఆలోచిస్తే, జీవాత్మ పురుషుని లోని భాగమే అయినా, ప్రకృతితో కలిసి పుట్టిన దానివలన, ప్రకృతి స్త్రీ తత్త్వము అయినందున, జీవాత్మ ప్రకృతియొక్క శరీరములో చిక్కుకొన్నంత వరకు జీవునికి పురుష లక్షణములు కొన్ని, స్త్రీ లక్షణములు కొన్ని ఉండును. కావున జీవాత్మను నపుంసకుడని చెప్పవచ్చును. విశ్వము మొత్తములో దేవుడు ఒక్కడే పురుషుడు కాగా, ప్రకృతి ఒక్కతే స్త్రీగా ఉన్నది. ప్రకృతి పరమాత్మలకు పుట్టిన జీవునికి, తల్లితండ్రుల ఇద్దరి లక్షణములు ఉండుట వలన జీవున్ని నపుంసకుడని చెప్పుచున్నాము. ప్రకృతి స్త్రీ అయినందున, ప్రకృతికి గుర్తుగా భూమిమీద స్త్రీ శరీరములను పుట్టించడము జరిగినది. పరమాత్మ పురుషుడైనందున, పరమాత్మకు గుర్తుగా పురుష రూపమును భూమిమీద పుట్టించడము జరిగినది. ప్రకృతి పురుషులకు పుట్టిన జీవుడు, ఇద్దరి లక్షణములు కలిసిన నపుంసకుడుగా ఉన్నాడు. కావున జీవునికి గుర్తుగా, భూమిమీద నపుంసకులను కూడా పుట్టించడము జరిగినది.

ప్రపంచములో జీవులందరికీ తల్లి ప్రకృతి అయినప్పుడు, అట్లే అందరికీ తండ్రి పరమాత్మ అయినప్పుడు, సంతతి అందరూ జీవాత్మలే అయినప్పుడు, స్పష్టముగా ఒక లెక్క తెలియుచున్నది. అదేమనగా! జీవుడు ఎక్కడ పుట్టినా, ఎక్కడ ఉండినా కొడుకుగానే ఉంటాడుగానీ తండ్రి ఎప్పటికీ

కాదు. బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము ఏ మనిషి అయినా, తనను కొడుకుగా చెప్పుకోవచ్చునుగానీ, తండ్రిగా చెప్పుకొనుటకు వీలులేదు. అందువలన భగవద్గీతా గ్రంథములో గుణత్రయ విభాగయోగమున 3,4 శ్లోకములలో నీకు తండ్రి పరమాత్మ, తల్లి ప్రకృతియని భగవంతుడు చెప్పాడు. బైబిలు గ్రంథములో మత్తయి సువార్త 23వ అధ్యాయములో 9వ వాక్యములో ***"భూమిమీద ఎవనినైన తండ్రియని పేరు పెట్టవద్దు. ఒక్కడే మీ తండ్రి. ఆయన పరలోక మందున్నాడు."*** అని చెప్పబడియున్నది. ఇకపోతే ఇస్లామ్ గ్రంథమైన ఖురాన్ గ్రంథములో 33వ సురా "అల్ అహ్‌జాబ్"లో 40వ ఆయత్‌నందు **"(మానవులారా) ముహమ్మద్ మీలోని ఏ పురుషునికీ తండ్రికాడు"** అని వ్రాయబడి ఉన్నది. చూచారా! భగవద్గీతలో, బైబిలులో, ఖురాన్ గ్రంథములో ఒక మనిషి ఎప్పటికీ కుమారుడేగానీ తండ్రికాడు అను విషయమును చెప్పారు. మూడు మూల గ్రంథములలోనూ దేవున్ని తండ్రిగా చెప్పడమైనది. మనిషిని తండ్రి స్థాయిలో లేడని చెప్పడమైనది.

బ్రహ్మజ్ఞానము ప్రకారము ఏ మనిషికీ సుతులు లేరు. సుతులు (కొడుకులు) లేనివాడు మోక్షమును పొందలేడు. అందువలన ఆ విషయము తెలియుటకు "సుతులు లేనివానికి గతులులేవు" అను సామెతను చెప్పారు. మోక్షమును పొందవలెననుకొన్నవాడు, దైవజ్ఞానమును సంపూర్ణముగా తెలిసి యోగిగా మారి, కర్మను లేకుండా చేసుకొన్నప్పుడు, అతను దేవునితో సమానముగా మారిపోయి ముక్తి పొందును. కొడుకుగాయున్న జీవుడు దైవజ్ఞానమును తెలియుట వలన తండ్రి స్థాయికి ఎదగగలడు. అపుడు అతను అందరికీ తండ్రిగా మారిపోగలడు. మనిషి జ్ఞానమును తెలియనంత వరకు, యోగిగా మారనంతవరకు తండ్రికి కొడుకుగానే ఉండును. తండ్రి

స్థాయికి ఎదగలేదు. తండ్రి స్థాయికి ఎదిగినప్పుడు సుతులు ఉంటారు. మోక్షము వస్తుంది. మీరు కొడుకు స్థాయినుండి తండ్రిస్థాయికి మారవలెనని మేము, మీకు కథల జ్ఞానమును అందించాము. తత్త్వముల జ్ఞానమును తెలియబరిచాము. తిట్లజ్ఞానమును వివరించాము. పద్యములోని జ్ఞానమును చెప్పాము. ఇప్పుడు సామెతల జ్ఞానమును తెలియజేయుచున్నాము. దీని తర్వాత పొడుపుకథల జ్ఞానమును తెలియజేయాలనుకొన్నాము. ఇన్ని విధముల జ్ఞానము తెలిసినపుడు, మనిషి జ్ఞానమును ఆచరించి సులభముగా యోగియై, తండ్రిస్థాయికి ఎదిగి ముక్తిని పొందగలడు. ఇప్పుడు నీవు కొడుకువే! సంపూర్ణ జ్ఞానమును తెలిసి తండ్రిగా అగుటకు ఇప్పటినుండి ప్రయత్నించు.

## 28. సున్నలో ఉన్నది సూక్ష్మం - సూక్ష్మంలో ఉన్నది మోక్షము

గణితశాస్త్రములో సంఖ్యలు మొత్తము పది ఉన్నవి. మొదటిది ఏ విలువలేని సున్న (0) తో మొదలై, తర్వాత 1,2,3,4,5,6,7,8,9 వరకు గలవు. మొదటిదైన సున్న, ఏమాత్రము విలువలేనిదిగా ఉన్నది. సున్న తర్వాత ఏకము ఉన్నది. ఏకము అనగా ఒకటని అర్థము. ఏకము తర్వాత అనేకము గలవు. అనేకము అనగా ఒకటికానిది అని అర్థము. ఏకమును కేంద్రముగా చేసుకొని అనేకము అంటే, రెండు అర్థములు రాగలవు. ఏకమునకు పైకిపోతే ఏకము కానిది సున్న అగును. క్రింది వైపుపోతే ఏకము కానిది 2,3,4,5,6 మొదలగునవి అగును. ఏకము కానిది అంటే సున్న అయినా కావచ్చు. సున్న ఏకము కాదు కదా! అందువలన అనేకము అనుమాటకు అర్థము సున్న కూడా కావచ్చును. ఇంకొక విధముగా, రెండు అంతకంటే ఎక్కువ సంఖ్య కూడా ఏకము

కాదు కదా! అందువలన అనేకము అనుమాటకు రెండువైపుల అర్థము కలదు. అనేకము అనుమాటను విన్నవారు, ఒకరు సున్న అనుకోవడము, మరొకరు రెండు అనుకోవడము జరుగవచ్చును. అట్లు పొరపాటు పడకుండుటకు ఒకటి తర్వాత ఉండు 2,3,4 మొదలగు వాటిని అనేకము అనునట్లు చేసి, ఒకటికంటే ముందున్న సున్న అర్థమగుటకు ఏకాగ్రము అన్నారు. ఏకాగ్రము అనగా ఒకటి కంటే పైన ఉండునది అని అర్థము. ఒకటికంటే పైన ఉండునది సున్నయే, కావున ఏకాగ్రము అనుమాట సరిపోయినది.

ఏకాగ్రములోనున్న సున్న ఎంతో ప్రత్యేకత కల్గియున్నది. సున్న తర్వాత గల తొమ్మిది అక్షరములకు లేని ప్రత్యేకత సున్నకు ఉన్నది. ఒకటి నుండి తొమ్మిది వరకు ప్రతి అక్షరమునకు మొదలు, చివర ఉంటుంది. ఉదాహరణకు కొన్ని అంకెలను తీసుకొని చూస్తాము.

ఆది
అంత్యము
ఆది
అంత్యము
మొదలు
చివర
ఆది
అంత్యము

ఈ విధముగా తొమ్మిది వరకు ప్రతి అంకెకు ఆది, అంత్యము రెండింటిని గుర్తించవచ్చును. అయితే ఒక్క సున్నకు మాత్రము ఎవరూ, ఆది అంత్యము గుర్తించలేరు. సున్నకు ఆది అంత్యము కనిపించదు.



సున్నకు ఏది మొదలో ఏది చివరో ఎవరూ చెప్పలేరు. ఈ సామెత యందు సున్నలో సూక్ష్మమున్నది అన్నారు. సూక్ష్మము అనగా కనిపించని భావము అని అర్థము. ఆ సూక్ష్మము ఏమనగా! ఆది అంత్యము లేనివాడు దేవుడు ఒక్కడే గలడు. సున్నలో కూడా ఆది అంత్యము లేదు, కనుక సున్నలో సూక్ష్మము కలదు అన్నారు. సూక్ష్మమైనవాడు, ఎవరికీ తెలియని వాడు దేవుడే, కనుక సూక్ష్మములో ఉన్నది మోక్షము అన్నారు. ఇప్పుడు ఏకాగ్రత అనగా, ఏకము మీద ఉన్న సున్న అని అర్థము రాగలదు. అలాగే ఏ ఒక్కటీ కానటువంటి దేవుడు అని అర్థము చేసుకోవచ్చును. ఇంకా ఆది అంత్యము లేని దేవుడని కూడా అర్థము చేసుకోవచ్చును. అందువలన మన పెద్దలు బహు తెలివిగా, సులభముగా, ఈ సామెతను తయారు చేశారు. ఈ సామెతను చూచిన వెంటనే ఎవరికైనా దేవుడు గుర్తు రాగలదు. సాధన చేయువారు మనస్సును ఏకాగ్రపరచుకోవడము అంటే, ధ్యాస నంతటిని ఏదీ కాని దాని మీద ఉంచుకోమని అర్థము.

## 29. నన్ను చూస్తే నిన్ను కాస్తా

భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్యా యోగమను అధ్యాయమున 22వ శ్లోకము ఇలా కలదు.

శ్లో॥ అనన్యాశ్చిన్త యన్తోమాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

**భావము :-** "ఎవడైతే అన్యచింత లేకుండా నన్నే ఉపాసించునో, ఎవడైతే నిత్యము నా ధ్యాసనే కలిగియుండవలెనని అనుకొనుచున్నాడో, వాని యోగము యొక్క క్షేమమును నేనే చూచుకొందును." ఈ శ్లోకములో ఏమి చెప్పారో, అదే విషయమును ఈ సామెతలో చెప్పడము జరిగినది. ఏ వ్యక్తి అయినా విశ్వమునంతటికీ దేవుడు ఒక్కడేనని గ్రహించి, ఆయన మినహా ఉన్నవారెవరైనా దేవునిచేత సృష్టింపబడినవారేననీ, అసలైన దేవుని మీదనే ధ్యాసకల్గి, ఆయనవద్దకే చేరిపోవలెనని ప్రయత్నించువాడెవడైనా గానీ, వానిని దేవుడు వాని ఉద్దేశ్యమునుండి ప్రక్కకు పోకుండా చూచును. మనిషి దేవున్ని గురించి ఎంత గాఢముగా ప్రయత్నము చేయుచున్నాడో, అంతే దృష్టి వానిమీద దేవుడు ఉంచును. దేవుడు పని చేయనివాడైన దానివలన, దేవుని పరిపాలన అతనికి ఏ ఆటంకము కలుగకుండా చేయును. అందువలన "నన్ను చూస్తే నిన్ను కాస్తా" అని ఈ సామెతలో చెప్పడము. జరిగినది. కొందరు ఎంత భక్తి కల్గియున్నా, ఏదైనా ప్రపంచ సంబంధమైన రోగమో, ఆర్థిక సమస్యయో వచ్చినప్పుడు, నేను దేవునిమీద ఎంతో భక్తిగా యున్నాను కదా! నాకు ఈ సమస్య ఎందుకు వచ్చినదనీ, దేవుడు తనను గమనించ లేదనీ, అనుకోవడము జరుగుచుండును. అయితే దేవునికి తెలియకుండా, దేవుని పరిపాలనకు తెలియకుండా, ప్రపంచములో ఏమీ

జరుగదు. అన్నీ దేవునికి తెలిసే జరుగుచుండును. మనిషి దేవుని మీద భక్తి కల్గి, దేవుడు ఒక్కడే కర్త అని తెలిసియుండుట వలన, అదే ఉద్దేశ్యములో అతనిని ఉండునట్లు చేసి, ఆ భావమునుండి వేరుకాకుండా, అతని భక్తిమార్గమునకు ఆటంకము కలుగకుండా దేవుడు చూచును. అంతేగానీ మిగతా ప్రపంచ సంబంధ కర్మలన్నిటినీ తీసివేస్తాడని అనుకోకూడదు. పై శ్లోకములో కూడా యోగముయొక్క క్షేమమును బాధ్యతగా చూస్తానని చెప్పాడుగానీ, నీ ప్రపంచ పనులన్నీ నెరవేరుస్తానని చెప్పలేదు కదా! ముందు భక్తుని ఉద్దేశ్యము దేవున్ని చేరవలెననియేగానీ, ప్రపంచ కోర్కెల నిమిత్తము దేవున్ని ఆశ్రయించ లేదు కదా! ఈ సామెతలో "నన్ను చూస్తే నిన్ను కాస్తా" అన్నాడు. నిన్ను కాస్తా అంటే శ్లోకములో చెప్పినట్లు, యోగక్షేమమును గురించేగానీ, మనిషి క్షేమమును గురించి కాదని తెలియవలెను. ప్రపంచ కోర్కెలను వదలు కోవడమే దేవుని జ్ఞానము కావున, జ్ఞాని అయినవాడు వజ్రముల కొరకు పోయి చింతకాయలను ఎలా ఆశించడో, అదే విధముగా దేవున్నే ఆశించిన వాడు ప్రపంచ విషయములను ఆశించడు. అదే విధముగా దేవుడు కూడా తన భక్తునికి, తన వరకూ చేరుటకు కావలసిన పట్టుదలను ఇచ్చి, దైవ మార్గములో ఏ ఆటంకమూ కలుగకుండా చేయును.

## 30. ఆడదే అమృతం, ఆడదే హాలాహలము

బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము పురుషుడనగా దేవుడనీ, స్త్రీ అనగా ప్రకృతియనీ తెలుసుకొన్నాము. దేవుడు కనిపించనివాడు, అయినా భగవంతునిగా మనముందరకు వచ్చి మాట్లాడుతాడు. ప్రకృతి కనిపిస్తున్నది, అయినా మాయగా, కనిపించకుండా మనయందు పని చేయుచున్నది. కనిపించని దేవుడు కనిపించే భగవంతునిగా వచ్చి, మనిషి మోక్షము

పొందుటకు కావలసిన జ్ఞానమును చెప్పితే, కనిపించే ప్రకృతి కనిపించని మాయగా ఉండి, మనిషి మోక్షము పొందకుండా ఉండుటకు కావలసిన అజ్ఞానమును బోధిస్తున్నది. ప్రకృతి స్త్రీ స్వరూపము, కావున ప్రకృతియే మాయగా ఉండి, అజ్ఞానములోనికి మనిషిని పోవునట్లు చేయడము వలన, ఆడదే హాలాహలము అని ఈ సామెతలో చెప్పడమైనది. హాలా హలము అనగా విషమని అర్థము. విషము మనిషిని బాధించునదే, కావున మనిషిని కర్మలలోనికి నెట్టి, జన్మలయందే చిక్కుకొనునట్లు చేయు మాయను హాలా హలము క్రిందికి జమకట్టి, ఆడది హాలాహలము అని చెప్పడములో తప్పులేదు. ఇక్కడ ఆడది అంటే ఇంట్లో భార్యయనో, వీధిలో వేశ్యయనో అనుకోకూడదు. ఆడదంటే స్త్రీ తత్త్వముగల మాయయని అర్థము చేసుకోవలెను. ఆడ అంటే దూరము అని అర్థము, దేవునికి దూరముగా పంపు మాయను ఆడది అని అన్నారు. ఆడది అను పదములో ఆడ+అది. ఆడది అని కలదు. ఆది అనగా దేవుడు అని అర్థము. అది అనగా మాయ అని అర్థము. ఆడది అనగా దూరము చేయునది మాయ అని తెలియుచున్నది. దేవునికి దూరము చేయుటే పనిగాయున్న మాయను విషముగా చెప్పినవారే, అదే మాయను అమృతముగా వర్ణించుచు ఆడదే అమృతము అన్నారు. విషమునకు పూర్తిగా వ్యతిరేఖముగానున్న పదము అమృతము. విషము చంపునదిగా, అమృతము బ్రతికించునదిగా ఉన్నది. దేవునికి దూరము చేయు మాయను ఆడది అని అన్నాగానీ, ఆడదే హాలాహలము అన్నాగానీ తప్పులేదు. అంతలోనే, ఆడదే అమృతము అనడమేమిటని ఎవరికైనా ప్రశ్నరాగలదు. దానికి జవాబు ఈ విధముగా గలదు.

ఆడది అనగా దూరము చేయునది అని తెలుసుకొన్నాము. దేనికి దూరము చేయునది అని ఎవరైనా అడిగితే, దేవునికి దూరము చేయునది అని సులభముగా చెప్పగలము. అయితే ఆ మాటను విన్నవాడు నవ్వి దేవుడు దగ్గరలో ఉన్నాడు, దూరములో ఉన్నాడు. దేవుడు ఎక్కడైనా కలడు, అలాంటపుడు దేవునికి దూరము చేయునది ఏది వుంది? నీవు ఎక్కడున్నా దేవునికి దగ్గరగానే ఉన్నపుడు, దేవునికి దూరము చేయడము అనుటలో అర్థమేలేదు. జన్మలకు దూరము చేయునది అంటే ఏదైనా ఉండవచ్చును గానీ, దేవున్ని దూరము చేయునది ఏదీ లేదు. ఆడది అంటే దూరము చేయునది అను అర్థము వాస్తవమే. అయితే మాయ అనునది జన్మలకు నిన్ను దూరము చేయు ఆడది అని ఎందుకు అనుకోకూడదు? జన్మలకు దూరము చేయు ఆడది మాయయే కావున, ఆడదే అమృతము అని కూడా చెప్పవచ్చును. విశేషమేమిటంటే మనిషికి దేవుని ఎడల ఉన్న ఉద్దేశ్యమును బట్టి మాయ ప్రవర్తించుచున్నది. దేవుని ఎడల మంచి ఉద్దేశ్యము లేనివానికి దేవుడు ఎదురుగా, దగ్గరేవున్నా తెలియకుండా, వాని కళ్ళను మూసివేయు చున్నది. దేవుని ఎడల మంచి ఉద్దేశ్యము ఉన్నవానికి తనముందరే, దగ్గరగాయున్న దేవున్ని తెలియునట్లు, వాని కళ్ళను తెరిపిస్తుంది.

పూర్వము చిన్న పిల్లలు ఒక ఆట ఆడెడివారు. ఒక పిల్లవానికి కళ్ళు మూసి ఎదురుగా కొంత మంది పిల్లలను ఉండునట్లు చేసి, కళ్ళు మూసినవానిని "ఈ రాముట్టి ఈ రాముట్టి వీడెవడు?" అని అడిగేవారు. అప్పుడు కళ్ళు మూయబడినవాడు, ఎదురుగా ఉన్న వానిని గుర్తించాలి. ఎదురుగా ఒకడుంటే, మరొకని పేరు చెప్పితే ఒప్పుకోక, మరొకనిని ఎదురుగా నిలబెట్టి, మొదట అడిగినట్లే 'ఈ రాముట్టి ఈ రాముట్టి వీడెవరు?' అని అడిగేవారు. కళ్ళు మూయబడినవాడు, ఎదురుగా ఉన్నవానిని

చూడకుండానే వీడు ఫలానావాడని పేరు చెప్పితే, అప్పుడు కళ్ళు తెరిచి చూచునట్లు చేసెడివారు. కళ్ళు మూయబడినవాడు, ఎదురుగా ఉన్నవానిని అంచనాగా ఫలానావాడని చెప్పగలిగితే ప్రత్యక్షముగా వానిని చూచునట్లు చేయుదురు. ఎదుటి వానిని ఏమాత్రము అంచనా వేయనప్పుడు, నీవు చెప్పినది తప్పు అని కళ్ళుమూసిన వాడు చెప్పి, కళ్ళకు అడ్డమున్న చేతులను తీసెడివాడు కాదు. పిల్లవాని వెనుక కూర్చొని తన చేతులతో పిల్లవాని కళ్ళను మూసి 'ఈ రాముట్టి ఈ రాముట్టి వీడెవరు' అని అడిగెడివారు ఎదురుగా ఉన్న వానిని కొద్దిగా అంచనాతో గుర్తించనంతవరకు, తన చేతులను పిల్లవాని కళ్ళ ముందరనుండి తీసెడివారు కాదు. ఆ ఆటను చూస్తే వెనుక కూర్చొని కళ్ళు మూయువాడు మాయ అనియూ, కళ్ళు మూయబడిన పిల్లవాడు మనిషి అనియూ, ఎదురుగానున్న పిల్లవాడు దేవుడు అనియూ, ఎదురుగా ఉన్నవానిని వీడెవరు అని అడిగినప్పుడు, తప్పుగా చెప్పడము దేవున్ని సరిగా అంచనా వేయలేక తప్పుగా అర్థము చేసుకోవడ మనియూ అర్థమగుచున్నది. ఈ రాముట్టి ఈ రాముట్టి అనుమాటను, ఓ అజ్ఞానీ, ఓ అజ్ఞానీ అని రెండుమార్లు చెప్పి, మన అజ్ఞానమును మాయ గుర్తు చేసినట్లున్నది. ఎదుటనున్న వానిని గుర్తించ నప్పుడు, సరిగా చెప్పునంతవరకు చూపించువాడే కళ్ళు మూసియుంచు తున్నాడు. కావున దేవున్ని తెలియకుండా మన కళ్ళకు అడ్డముగానున్న మాయయే, దేవున్ని కొంతవరకు అర్థము చేసుకొన్నపుడు కళ్ళను తెరిపించి చూపుచున్నది. ఇదంతయు గమనిస్తే మాయ, మనిషి ఎడల రెండు రకములుగా ప్రవర్తించు చున్నదనీ, అందువలననే ఇదంతయు తెలిసిన పెద్దలు పై సామెతను "ఆడదే అమృతం, ఆడదే హాలాహలము" అని చెప్పారనీ అర్థమగుచున్నది.

## 31. నలుగురు తర్వాత పుట్టితే, నట్టిల్లు బంగారమవుతుంది, ముగ్గురు తర్వాత పుట్టితే, ముయ్య మూకుడు ఉండదు.

నలుగురి తర్వాత ఐదవ సంతానముగా పుట్టినవాడు ఐశ్వర్యమును అనుభవిస్తాడనీ, ముగ్గురు తర్వాత పుట్టిన వానికి, వాని జీవితములో కుండ మీద మూసుకొనే మూకుడు (మట్టితో చేసిన పళ్ళెము) కూడా ఉండదనీ, చాల దరిద్ర జీవితమును అనుభవించుననీ కొందరు చెప్పు చుందురు. ఈ సామెతను చూచి కొందరు అలా చెప్పారని అర్థమగుచున్నది. ఈ సామెతలో పైకి కనిపించునది ఐశ్వర్యము, దరిద్రము అయినా, అదియూ ఐదవ సంతతికి ఐశ్వర్యము అని, నాల్గవ సంతతికి దరిద్రము అని ఉన్నా, ఇక్కడ మనము సామెతను బ్రహ్మవిద్యా సూత్రములను అనుసరించి ఆధ్యాత్మికమునకు అన్వయించునదిగా ఉండునట్లు చెప్పుకోవలెను. సామెతలో ముఖ్యముగా నలుగురి తర్వాత అనియూ, ముగ్గురు తర్వాత అనియూ ఉన్నది. ముందు నల్గురి తర్వాత పుట్టిన వాడు ఎవడో, వానికంటే ముందు పుట్టిన వారెవరో గమనిస్తాము. మనిషి శరీరములో తలయందు గుణ చక్రముందని ముందే తెలుసుకొన్నాము. ఆ గుణచక్రము నాలుగు భాగములుగా ఉన్నదని కూడా తెలుసుకొన్నాము. గుణచక్రములోని నాలుగు భాగములను, బయటినుండి మొదటిది తామస భాగమనీ, రెండవది రాజస భాగమనీ, మూడవది సాత్త్విక భాగమనీ, నాల్గవది ఆత్మ భాగమనీ (యోగ భాగమనీ) చెప్పుకొన్నాము. ఈ నాలుగు భాగములలో మొదటి మూడు భాగములు గుణ భాగములుకాగా, నాల్గవది గుణరహితమైన భాగముగా ఉన్నది. గుణచక్రమును తర్వాత పేజీ పటములో చూడుము.




మన తలలో కనిపించకుండావున్న గుణచక్రమును నీవెలా ప్రత్యక్షము గా చూపుచున్నావని మీరు అడగవద్దండి. నా మీద నమ్మకముతో చూడండి. గతజన్మలో, జీవుడు చనిపోయినపుడు ఏ గుణభాగములో ఉండునో, తిరిగి జన్మించునపుడు అదే గుణములో ఉండి జన్మించును. నాలుగు భాగముల గుణచక్రములో మూడు భాగములలో గుణములున్నవి. ఈ మూడు భాగములలోనే గుణరూపములో మాయ ఉన్నది. మధ్యలోని నాల్గవ భాగము గుణములు లేనిదై, గుణ రహిత యోగ భాగముగా ఉన్నది. మనిషి సజీవముగా ఉన్నప్పుడు, లోపలి జీవుడు ఈ నాలుగు భాగములలో ఎక్కడో ఒక చోట ఉండును. మూడు గుణ భాగములలో ఉన్నంతవరకు మాయ వానిని కళ్ళు మూసిపెట్టి నడిపించుచున్నది. గుణ మాయలో ఉన్నవాడు యజ్ఞములు, వేదాధ్యయనము, తపస్సు, దానములను చేయును గానీ యోగమును చేయడు. నాల్గవ స్థానములోనికి పోయినవాడు మాత్రమే యోగమును ఆచరించును. నాల్గవ స్థానము యోగస్థానము కావున, జీవున్ని మూసిపెట్టు మాయ లేనిదానివలన అక్కడ ఉన్నవాడు యోగియై యోగమును ఆచరించును. మొదటిదైన తామస గుణభాగములోనున్న

జీవున్ని తామసుడు అని అంటాము. అలాగే రెండవ భాగమైన రాజస గుణ భాగములోనున్న జీవున్ని రాజసుడు అని అంటాము. మూడవ గుణ భాగమైన సాత్త్వికములో నున్నవానిని సాత్త్వికుడు అని అంటాము. ఇక నాల్గవ భాగములోనున్న వానిని యోగి అంటాము.

ఇక్కడ మీకు బాగా అర్థమగుటకు ఒక విషయమును చెప్పుదును చూడండి. మేము వ్రాసిన "ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు" అను గ్రంథములో ఇతరులు నన్ను "మీరు ఏమి చదువుకొన్నారు" అని ప్రశ్నించారు. దానికి జవాబుగా నేనిలా చెప్పాను. "ప్రపంచ చదువును చెప్పితే, పదకొండు తరగతులు చదివాను. ఆధ్యాత్మిక విద్య అయితే మూడవ తరగతి అయిపోయి, నాల్గవ తరగతిలోనికి వచ్చి, నాల్గవది చదువుచున్నాను. నాల్గవ తరగతి పూర్తిగా చదివిన తర్వాత ఐదవ తరగతికి పోవాలను కొంటున్నాను." అక్కడ నేను అలా చెప్పిన దానికీ, ఈ సామెతను సమన్వయము చేసుకొని చూస్తే ముగ్గురి తర్వాత పుట్టినవానిగా నన్ను లెక్కించవచ్చును. తామసుడు, రాజసుడు, సాత్త్వికుడు పుట్టిన తర్వాత పుట్టినవాడు యోగి అగును. యోగి అయినవానిని మాయ ఏమీ చేయదు. నాల్గవ స్థానములో గుణములు లేవు. కావున మాయకు యోగిని తన కుండలోవేసి మూయుటకు మూకుడు ఉండదు. అందువలన సామెతలో ముగ్గురు తర్వాత పుట్టితే ముయ్య మూకుడు ఉండదు అని చెప్పారు. అంతేగానీ ప్రపంచరీత్యా దరిద్రుడని అర్థము చేసుకోకూడదు. గుణచక్రము లోని నాలుగు భాగములను దాటిపోతే అవతల ఐదవదిగానున్నది అవధులులేని పరమాత్మ. కావున నాలుగు దాటినవాడు మోక్షమును పొందుచున్నాడు. ఆ విషయమును సామెతలో నలుగురు తర్వాత పుట్టితే నట్టిల్లు బంగారమగును" అని అన్నారు. ఈ సామెత అత్యంత జ్ఞానము కలదిగా ఉన్నది. మూడు గుణ భాగములు

మాయకు నిలయముగా ఉండుట వలన, మూడు తర్వాత పుట్టితేనని మూడును, మాయకు గుర్తింపుగా చెప్పారు. తర్వాత జన్మరాహిత్యమును పొందినవాడు శరీరములోని గుణచక్రములో ఉండక, బాహ్యములో అంతటా వ్యాపించిన దేవునిలో కలిసిపోవుచున్నాడు. కనుక మోక్షమును గొప్ప విలువైన బంగారుతో పోల్చుతూ, వానిల్లు బంగారమవుతుందని చెప్పారు.

## 32. ఆవులిస్తే ప్రేగులు లెక్కపెట్టినట్లు

నేను చూచినంత వరకు, బాగా తెలివైన వానిని గురించి ఎవరైనా చెప్పునప్పుడు. వాడు ఆవులిస్తే ప్రేగులు లెక్కపెట్టు మేధావి అని చెప్పు చుందురు. వారు అలా చెప్పడము నాకు చాలా ఆశ్చర్యమేసినది. ఎందుకనగా వారు చెప్పే సామెత, తెలివి తక్కువ వారిని గురించి చెప్పేది. తెలివి తక్కువ వానిని గూర్చి చెప్పునప్పుడు, ఆవులిస్తే ప్రేగులు లెక్కపెట్టే రకమని పూర్వము చెప్పేడివారు. ఎందుకనగా! మనిషి శరీరములో ప్రేగులు ఎన్నో ఉండవు. 32 అడుగుల పొడవున్న ఒకే ప్రేగు ఉండును. ఆవులిస్తే ప్రేగులు లెక్క చెప్పువాడున్నాడంటే, వాడు ఏమీ తెలియనివాడని అర్థము. అంతేకాదు, వాడు అబద్ధము చెప్పేవాడని గుర్తు. అందువలన కడుపులో లేని ప్రేగులను ఇన్ని ఉన్నాయని చెప్పువాడు ప్రేగు ఒకటే ఉందని తెలియని తెలివి తక్కువవాడనీ, అబద్దములు చెప్పేవాడనీ అందరికీ అర్థమైపోగలదు. భావమునకు వ్యతిరేఖముగా, తెలివున్న మేధావిని గురించి చెప్పునప్పుడు ఈ సామెతను వాడేవారు కూడా, తెలివి తక్కువైపోగలరు. అందువలన బాగా ఆలోచిస్తే 'ఆవులిస్తే పళ్ళను లెక్కపెట్టేవాడని', మేధావిని గురించి చెప్పవచ్చును. తెలివి తక్కువ వానిని గురించి చెప్పునపుడు, ఆవులిస్తే ప్రేగులు లెక్కపెట్టునట్లేనని చెప్పవచ్చును.

## 33. ఏమీ ఎరగనోడు ఏకాసినాడు చస్తే, అన్నీ తెలిసినోడు అమావాస్యనాడు చచ్చినాడట!

ఈ సామెతలో ఏమీ తెలియనోడు, అన్నీ తెలిసినోడు అని రెండు రకముల వారున్నారు. అంతేకాక ఏకాసి (ఏకాదశి) మరియు అమావాస్య అని రెండు తిథులు గలవు. ఒకటేమో శుక్లపక్ష ఏకాదశి, రెండవది కృష్ణ పక్ష అమావాస్య అని గుర్తుంచుకోవలెను. ఇకపోతే ఒక బ్రహ్మయోగిని ఏమీ ఎరగనోడు అనియూ, ప్రపంచ విషయములన్నిటినీ తెలిసి ధ్యానమును చేయువానిని, అన్నీ తెలిసినోడు అనియూ గుర్తుంచుకోవలెను. ఇప్పుడు ఈ సామెతను వివరించుకొంటే బాగా అర్థముకాగలదు. ఒక బ్రహ్మయోగి, కళ్ళు మూసుకొని కూర్చొని బాహ్య శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను ఐదు ధ్యాసలు లేకుండా పూర్తిగా బ్రహ్మయోగములో లగ్నమై ఉన్నాడు. మరొకడు సన్యాసత్వమును తీసుకొని, కాషాయగుడ్డలు ధరించి సంస్కృతమును నేర్చి, వేదములను, పురాణమును, ఉపనిషత్తులను కంఠా పాఠముచేసుకొని ధ్యానమును నిత్యమూ చేయుచూ, ధారాళముగా ఉపన్యాసములు చెప్పుచూ, గొప్ప స్వామీజీగా చలామణి అగుచున్నాడు. ఈ విధముగా ఇద్దరు వ్యక్తులు దైవమార్గమును అనుసరించాలనుకొని, ఒకరు బ్రహ్మయోగ సాధన చేయగా, మరొకరు స్వామియై ఉపన్యాస మేథావి అనీ, తపస్వి అనీ పేరు పొందాడు. కొంతకాలము జరిగిపోగా మొదటివాడు బ్రహ్మయోగములో తన కర్మనంతటినీ జ్ఞానాగ్నిలో కాల్చుకోగలిగాడు. సన్యాసియైన రెండవవాడు స్వామిగా, ఉపన్యాసకర్తగా పేరుగాంచి ప్రజలు, భక్తులు ఇచ్చిన సొమ్మును ప్రోగుచేసుకొని కోటీశ్వరుడైపోయాడు. కనిపించే ధనము చేకూరినట్లే, కనిపించని కర్మ కూడా ప్రోగయ్యింది. తర్వాత,

బ్రహ్మ యోగికి మరణము వచ్చి శుక్లపక్ష ఏకాదశి రోజు, పగలు పన్నెండు గంటలకు, ఉత్తరాయణములో చనిపోవడము జరిగినది. అతడు యోగి అయినందున దేవుడు భగవద్గీతలో చెప్పినట్లు, మోక్షము పొందు కాల నియమము ప్రకారము చనిపోవడము వలన, అతడు మరుజన్మకు పోకుండా దేవునియందైక్యమైపోయాడు. తర్వాత, స్వామి అయినవాడు అమావాస్య రోజు చనిపోయాడు. మోక్షమును పొందు కాలమునకు సరిపోవునట్లు మరణించక అమావాస్య రోజు మరణించడము వలన, అతడు తిరిగి రెండవ జన్మకు పోవలసివచ్చినది. ఈ సామెతలో యోగికీ, తపస్వికీ ఉన్న తేడాను చూపడము జరిగినది. ఎంత తపస్వి అయినా, ఎంత ధ్యానము చేసినా, ఎంత పెద్ద స్వామీజీ అయినా దేవునివద్ద చోటు దొరకదనీ, మోక్షము లభించదనీ, యోగికి మాత్రమే మోక్షము లభించుననీ తెలియుచున్నది.

## 34. ఏమి చేస్తున్నావురా అంటే, ఒలకపోసి ఎత్తుకొంటున్నాను అన్నట్లు

ఒకడు దైవజ్ఞానము మీద ఆసక్తికలవాడై, త్రైత సిద్ధాంత భగవద్గీతను చదివి పూర్తి జ్ఞానమును తెలుసుకోగలిగాడు. అంతకు ముందు దాదాపు పది భగవద్గీతలను చదివినప్పటికీ తెలియని జ్ఞానము, త్రైత సిద్ధాంత భగవద్గీతను చదువుట వలన తెలుసుకోగలిగాడు. దానితో శరీరములో జరుగు యంత్రాంగమంతయు తెలిసిపోయింది. ప్రతి మనిషి, గత జన్మలలో చేసుకొన్న కర్మను అనుభవించుటకు పుట్టుచున్నాడనీ, పుట్టినవాడు గత జన్మ కర్మను ఒక్కొక్కదానిని అనుభవిస్తున్నానని తెలియక, కర్మ అనుభవించుటకు, శరీరములో ఆత్మ చేయించిన పనిని, జీవుడైన తాను

చేయకున్ననూ, అహము మాట విని అహంభావమును పొంది, నేనే చేశానని అనుకోవడము వలన, తిరిగి క్రొత్త కర్మ రావడము జరుగుచున్నదని తెలుసుకో గలిగాడు. తనకు జ్ఞానము తెలిసిన దానివలన, అందరూ తెలియక వారు చేయని కర్మలను అనవసరముగా నెత్తిన వేసుకొంటున్నారనీ, అలా నేను క్రొత్త కర్మలను సంపాదించుకోకుండా, ఆత్మ చేయించే పనులను చేస్తూ అందులోని సుఖదుఃఖములను అనుభవించి, పాతకర్మను అయిపోగొట్టు కొందుననీ అనుకొన్నాడు. అతను అనుకొన్నది కర్మయోగమునకు సంబంధించిన జ్ఞానము. కావున తాను చేయుచున్న పనులను, నిత్యమూ ఎరుకతో చేయగలిగితే పాతకర్మ అయిపోవును, క్రొత్తకర్మ రాకుండ పోవును.

త్రైత సిద్ధాంత భగవద్గీతను చదివి, సులభముగా కర్మయోగమును గ్రహించిన అతను ప్రతీ నిత్యము పనులు చేయుచున్నప్పుడు, తాను తెలుసుకొన్న సూత్రము మీద ఎరుక లేకుండా మరచిపోయి, చిన్నప్పటి నుండి ఉన్న అలవాటు ప్రకారము, చేసిన పనిని తానే చేశానని అనుకోవడము జరుగుచుండెను. పని జరిగిపోయిన తర్వాత, భగవద్గీత జ్ఞానమును జ్ఞప్తి తెచ్చుకొని తన భావములో, పనిని చేస్తున్నప్పుడు నేనే చేస్తున్నానని అను కోవడము వలన, దానిలోని కర్మ వచ్చినదని అతనికి అర్థమగుచుండెను. ఇలా పనిని చేయుచున్నప్పుడు కర్మయోగ జ్ఞప్తి ఉండవలెనని అనుకొనినా చేయుచున్న సమయములో కర్మయోగ ధ్యాసపోయి, పనిమీద ధ్యాస రావడము వలన పనిని తానే చేయునట్లు భావము తెలియకనే వస్తున్నది. అట్లు కర్మ యోగ ధ్యాస లేకుండా పోయి, అహము యొక్క భావము రావడము వలన, క్రొత్త కర్మ వస్తున్నదని అతనికి ఒకవైపు అర్థమగుచున్నది. ఈ విధముగా కర్మయోగమునకు ప్రయత్నము చేయు సమయములో, ఒక యోగి వచ్చి నీవు ఏమి చేయుచున్నావని భగవద్గీత

జ్ఞానిని ప్రశ్నించాడు. అప్పుడతడు "ఒలకపోసి ఎత్తుకొంటున్నానన్నాడట". ఆ మాట విన్న యోగికి అతనిమాట అర్థమై నవ్వాడట. కర్మను తలనుండి అనుభవముల రూపములో ఒలక పోస్తూ, అహముతో వాటినే క్రొత్తగా తిరిగి తలకు ఎత్తుకొంటున్నట్లు. గీతా జ్ఞాని చెప్పినట్లు మనకు కూడా కొంత అర్థమైనది. ప్రయత్నము చేస్తున్న కర్మయోగి అయినవాడు, తన విషయమును తెలుపుటకు ఆ మాటనే సామెతగా చెప్పాడు. ఒలకపోసి ఎత్తుకోవడము అతనొక్కడే కాదు ప్రతి దినమూ అదే పనిని మనము కూడా చేయుచున్నాము. ఈ మధ్యన నాకు వయస్సు పెరిగిన దానివలన, కొంత చూపు తగ్గిపోయి సరిగా కనిపించడములేదు. అలాగే పూర్తి వినిపించడము లేదు. అందువలన నానెత్తిన నుండి క్రింద పడిపోయిన వాటిని, చూపు సరిగా లేనందున ఎక్కడ పడినాయో తెలియక పూర్తిగా ఎత్తుకోలేక పోవుచున్నాను. అందువలన నేను నష్టపోవుచున్నానని సంతోషపడాలా లేక బాధపడాలా మీరే చెప్పండి.

చూచారా! మన పెద్దలు తెలుగు భాషలో ఎంతపెద్ద జ్ఞానముగల సామెతలను చెప్పారో? వాటిని విప్పి చెప్పుకోకపోతే, వారి శ్రమ అంతా వృథా అవుతుంది. అలాకాకుండా ఉండుటకు, నాకు తెలిసింది తెలిసినట్లు చెప్పాను.

**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**



**అసత్యమును వేయిమంది చెప్పినా, అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా, అది అసత్యము కాదు.**

# సామెతల జ్ఞానము

## ఇందూ (హిందూ) ధర్మములో సిద్ధాంతకర్తలు


అద్వైత సిద్ధాంతకర్త **ఆది శంకరాచార్యులు**
Birth : 788 - Death : 820 (32 Years) కేరళ


విశిష్టాద్వైత సిద్ధాంతకర్త **రామానుజాచార్యులు**
Birth : 1017 - Death : 1137 (120 Years) తమిళనాడు


ద్వైత సిద్ధాంతకర్త **మధ్వాచార్యులు**
Birth : 1238 - Death : 1317 (79 Years) కర్నాటక


త్రైతసిద్ధాంత ఆదికర్త ఆచార్య **ప్రబోధానంద యోగీశ్వర్లు**
Birth : 1950 ఆంధ్రప్రదేశ్

Author : Thraitha Siddhantha Adikartha
SRI ACHARYA PRABODHANANDA YOGEESWARLU